చండకౌశికము అను
హరిశ్చంద్ర నాటకము

— వడ్డాది సుబ్బారాయకవి

ము ద్ర ణ :
మే - 1998



మూల్యం : రు. 25/-

ముఖచిత్రం :
వి. యస్. ప్రకాశ్

ముద్రణ :
వంశీకృష్ణా ప్రింటర్స్
ఫోన్ : Res. 482935
విజయా టాకీస్ వెనుక
విజయవాడ - 2.

ప్రకాశకులు :
ఫోన్ : 73444
రో హి ణీ ప బ్లి కే ష న్స్
మెయిన్ రోడ్
రాజమండ్రి — 1.

# 75 సంవత్సరాల తర్వాత

## మళ్ళా వెలుగులోకి వస్తూన్న

## చండకౌశికం

అను

# హరిశ్చంద్ర నాటకం

: రచన :

## వడ్డాది సుబ్బరాయకవి

అప్పుడెప్పుడో 75 సం॥రాల క్రిందట 1920లో ముద్రించబడి మరుగున పడిపోయిన ఈ నాటకరాజాన్ని ఆంధ్ర సాహితీ ప్రియుల, కళాప్రియుల కోరికననుసరించి ఈ 1995లో తాజాగా ముద్రించాం.

మార్కండేయ పురాణాంతర్గతమైన కథ ఆధారంగా రచించ బడిన ఈ నాటకం, అనంతరకాలంలో ఎన్నో హరిశ్చంద్ర నాటకాల ఆవిర్భావానికి మూలబీజమైన నాటకం యిది. ఈనాడు ప్రాచుర్యంలో వున్న హరిశ్చంద్ర నాటకాలకన్నా విభిన్నంగా వినూత్నపోకడతో ఆనాడే వ్రాయబడిన అపురూప రూపకం ఇది.

ఈ హరిశ్చంద్రుడి కథ - స్కాంద పురాణంలో ఒకలాగా, మార్కండేయపురాణంలో మరొకలాగ - దేవీభాగవతంలో ఇంకొక లాగా - విభిన్న తరహాలుగావుంది. ఈనాటి హరిశ్చంద్ర కథలన్నీ స్కాంద పురాణంలోనివికాగా—

ఈ "హరిశ్చంద్ర" మాత్రం మార్కండేయ పురాణం ఆధారంగా రచించబడింది.

మూలకథ హరిశ్చంద్రుడి సత్యవ్రతం, విశ్వామిత్రుడు అతడిని పరీక్షచేయడమే-అయినా-ఏ ఇతర నాటకంలోనూ లేని పాపపురుషుడు, భృంగీశ్వరుడు మొదలైన వినూత్న పాత్రలతో-సరళమైన-న్యాయ మైన విభిన్న సంఘటనలతో పండిత పామరుల్ని రంజింపచేసే నాటకం.

ప్రకాశకులు.

# పీఠిక

చండకౌశికమను నీ నాటకమును క్షేమేశ్వరుఁడను కవీశ్వరుఁడు గీర్వాణ భాష యందు రచియించినాఁడు. చండకౌశిక శబ్దమునకు మిక్కిలి కోపముగల విశ్వామిత్రుఁడని యర్థము. హరిశ్చంద్రుని కారణమునఁ గౌశికుఁడు ప్రచండతను వహించిన కథ యిందుఁగవి వర్ణించటంజేసి దీని కా నామధేయము ఘటిల్లినది. హరిశ్చంద్రుని చరిత్రము స్కాందపురాణమునందొక విధముగాను మార్కండేయ పురాణమునందు మఱియొక విధముగాను గానవచ్చు చున్నది. రసవంతముగా స్వేచ్ఛమైనాంధ్రీకరించి ప్రకటించిన శంకర కవిప్రబంధము దేశమందెల్లడ వ్యాపించుటం బట్టియో మఱి యే హేతువుచేతనో గాని స్కాందపురాణోక్తమైన కథయే యాబాల గోపాల ప్రసిద్ధమయినది, తఱచుగా నాధునికులు ప్రదర్శించెడు నాటకములయందు నదియే మనము చూచుచున్నాము.

సత్యము తప్పనివాఁడు లోకములో నెవ్వఁడేని కలఁడాయని దేవేంద్రుఁడు తన విందుగొలువున నడిగిన ప్రశ్నమునకు నుత్తరముగా హరిశ్చంద్రుఁడను రాజపుంగవుండొకడు గలఁడని వసిష్ఠుఁడన్న మాటమీఁద బిట్టుగినిసి కౌశికుఁ డెట్టులయిన నే నాతేని బొంకింతునని ప్రతిజ్ఞపట్టి యాపట్టును నెగ్గించుకొనుటకు సక్రమముగా నెన్నెన్నో మాయలు పన్ని యామన్నీను నెన్నరానియాపదలపాలు వఱిచినట్లు స్కాందంబునఁ జెప్పఁబడియున్నది. తపోధనమూర్ధన్యుఁడయిన విశ్వామిత్ర మహర్షిని నంతయవివేకపుఁ బాత్రముగాఁ బ్రదర్శించుట నాటకస్వభావమునకు సరిపడియుండదని కాఁబోలు క్షేమేశ్వరకవి యాపుంతను విడిచి యక్కడక్కడ నొక్కింత మార్పుతో మార్కండేయపురాణోక్త కథాసరణి నీ నాటకమును నడిపించినాడు.

హరిహరహిరణ్యగర్భుల విద్యాత్రియమును దాను సాధింతునని గాధేయుఁ డుగ్రతపంబుఁ జేయుచుండఁగా సకలవిద్యలా ముప్పురకేకాని మఱియొవ్వరికిని నుండఁ బోలదని విఘ్నరాట్టు, వరాహరూపమున నొక యరణ్యమునఁ బ్రవేశించి, తన చేయురా యిడి కోర్వలేక మొఱ్ఱపెట్టుకొన్న యెఱుకుల మున్నుంచుకొని వేట వచ్చిన హరిశ్చంద్రుని మాయోపాయమున విశ్వామిత్రాశ్రమమునకు గొనిపోయెను. అప్పు

దమ్మునితపః ప్రభావమ్మున హోమకుండములోనికి వచ్చిన విద్యలు "కటకటా! యనపరాధినుల మనాథల మశరణ్యల మగ్నికుండమునఁ ద్రోయఁబడుచున్నాము. మందభాగినులను మమ్ము రక్షింపుఁడు రక్షింపుఁడని" యంగలార్వగా నయ్యార్తాలాపంబులు తన చెవిని బడినందున నెవ్వడో క్రూరరాక్షసుఁడు స్త్రీ హత్య చేయుచున్నాఁడని యాగ్రహించి యిదిగో మీకభయప్రదాతను వచ్చుచున్నాను. వెఱవకు వెఱవకుఁడని యారాజు తోడనే యక్కడకుఁబోయి యాబీభత్సకర్మంబునకు రోసి, యెఱుంగమింజేసి యారుసిని మిగుల గద్దించి పలికెను. అందుమీఁదఁ దోక ద్రొక్కిన పామువలె నా మునీంద్రుఁడు మండిపడఁగా నవ్విద్యలతనికిఁ దపోవిఘ్నమయిన దనుసంతసముతో మాకుఁ బ్రియము మాకుఁ బ్రియము, హరిశ్చంద్ర మహారాజా! నీకుజయము నీకు జయమనుచు నంతర్ధానంబునొందిరి. తనదగు తప ప్రభావంబునఁ జేతిలోనికి వచ్చిన మహాఫలమును నిముషములో నిల్లెగరఁగొట్టి వేసినవాఁడు హరిశ్చంద్రుఁడని తెలిసినతోడనే విశ్వామిత్రుని కాతనిమీఁద నాపరాని కోపమువచ్చి పగ తీర్చుకొనుటకుఁ బ్రయత్నించెను. స్కాందమునఁ జెప్పఁబడిన దానికంటె విశ్వామిత్ర కోపమున కిది సయుక్తికమైన కారణముగానుండు నని నేనూహించుచున్నాను. ఇట్లే మఱికొన్ని విషయములుగూడ దీనియందు సరసమయిన మార్పులను బొంది వన్నెమీఱుచున్నవి. నాటకము చదువుటవలన నాయాయంశములు గోచరింపఁగలవు గావున గ్రంథవిస్తరభీతినవి యిచ్చట వివరింపనయితిని.

క్రోధకరుణ బీభత్స రసంబులకాలవాల మయిన యీ నాటకమునందు శృంగార రసమున కవకాశము లేక పోయినను బ్రథమాంకమున దానికిఁ గూడఁగవి కొంచెమవకాశము గలిగించినాఁడు. హరిశ్చంద్రునికి రాఁగలయరిష్టములు దివ్యదృష్టిని దెలిసికొని వసిష్ఠుఁడు తచ్ఛాంతికయి యారాజునకు నొకనాఁడు రహస్యముగా రేయెల్లజాగారము చేయవలయునని యాదేశించెను. ఆ కారణమున నామా నంతఃపురమునకుఁబోక మఱునాఁడుదయమున దేవిని జూడ నేగుచుం గడచినరేయి తన కొఱకు వేచి యుండి ప్రియురాలు మిక్కిలి వలకాఁకను వేగి యుండునని దలంచుకొని తద్విషయమును రాజు విదూషకునితోఁ గొంత ప్రస్తావించినాఁడు. అక్కడఁ దక్క మఱి యెక్కడ నిందు శృంగారరసము గోచరించదు.

హరిశ్చంద్రుని భార్యకుఁ జంద్రమతి యనియుఁ గుమారునికి లోహితాస్యుఁ డనియుఁ బ్రసిద్ధనామములు గలిగియున్నను మార్కండేయ పురాణ కథానుసారముగా వారి పేరులిందు వరుసగా శైబ్యయనియు రోహితాశ్వుఁడనియు మార్చఁబడినవి. సామాన్యముగా వినవచ్చు హరిశ్చంద్ర కథకును దీనికిని మఱి కొన్ని భేదములు గూడఁ గానఁ బడ వచ్చును. అట్టివానికిఁ గారణము పూర్వోక్త పురాణమునందలి ప్రథమాశ్వాసమున ద్రౌపదేయకథాప్రకారకథనంబునకయి పక్షివరులు వివరించిన హరిశ్చంద్రోపాఖ్యానము జదివిన స్పష్టపడియెడును.

క్షేమేశ్వర కవిచరిత్రమును గుఱించి కాని తద్విరచితములగు నితరగ్రంథము లను గుఱిచించి కాని తెలుపుట కిప్పటి కేమియు నాకుఁ దెలియవచ్చినది కాదు ఈ నాటకమును దెలిగించుటయందు నేను విశేషశ్రద్ధనే పుచ్చుకొన్నాను. అయినను నాకించిజ్జ్ఞతనుబట్టి యిందనేకలోపము లుండవచ్చును. భాషాప్రపంచమున నభిమానము గలమనీషావంతులు సముచితరీతి వానిని బరహరించి దీనిఁ దమయాదరమునకుఁ బాత్రము గావింపఁ బ్రార్థించుచున్నాను.

రాజమహేంద్రవరము
22 జూలై 1900 సం॥రం

వడ్డాది సుబ్బారాయఁడు

# ఈ నాటకము నందలి పాత్రములు

## పురుషులు

హరిశ్చంద్రుఁడు—అయోధ్యాధిపుఁడు. కథానాయకుఁడు.

బోధాయనుఁడు—రాజునకు వేడుక చెలికాఁడు.

తాపసుఁడు—వసిష్ఠశిష్యుడు. రాజునకుశాంత్యుదకము దెచ్చినవాఁడు.

వనచరుఁడు—రాజును వేఁటకుఁ బిలువ వచ్చిన కిరాతుఁడు.

విఘ్నకర్త—విశ్వామిత్రుతపముఁ జెఱుప వరాహమయినవాఁడు.

సూతుఁడు—రాజుసారథి.

విశ్వామిత్రుఁడు—రాజు వలన రాజ్యదానము పొందిన మహర్షి.

పాపపురుషుఁడు—పురుషరూపము ధరించిన పాపము.

భృంగీశ్వరుఁడు—శివుని పరిచారకుఁడు.

రోహితాశ్వుఁడు—రాజు కుమారుఁడు.

ఉపాధ్యాయుఁడు—రాజు భార్యను, గుమారునిఁ గొన్న బ్రాహ్మణుఁడు.

వటుఁడు—ఉపాధ్యాయుని శిష్యుఁడు.

విశ్వేదేవులు—విమానము నుండి విశ్వామిత్రుని నిందించిన దేవతలు.

ధర్ముఁడు—రాజునుగొనుటకుఁ జండాలవేషియయిన ధర్మదేవత.

అనుచరుఁడు—ధర్ముని శిష్యుఁడు.

కాపాలికుఁడు—రాజుయోగ్యతఁ బరీక్షింప మఱియొక వేషము దాల్చినధర్మదేవత

బేతాళుఁడు —కాపాలికు నాజ్ఞచే రాజునొద్దకు విధిదెచ్చిన పిశాచరాజు.

పురుషుఁడు—ధర్ముని పరిచారకుఁడు.

## స్త్రీలు

శైబ్య—రాజు భార్య.

చారుమతిక—చేటి.

హేమప్రభ—ప్రతీహారి.

విద్యలు—విశ్వామిత్రుని హోమకుండమునఁ బ్రత్యక్షమయిన త్రిశక్తులు.

శ్రీ పరమాత్మనే నమః

# హరిశ్చంద్ర నాటకము

## నాంది

పొనరుచుఁ బెంచుఁ ద్రుంచు జగముల్ త్రిగుణాత్మత నీవిభుండె, యీ
యన వితతాష్టమూర్తులనె వ్యాప్తము విశ్వము, లేఁడు వంద్యుఁ డీ
తని కనుమాడ్కిఁ, గంకణపుఁ ద్రాఁచులపూత్కృతిఁదూలి నర్తనా
దిని బదలగ్నమౌ పశుపతి ప్రసవాంజలి మిమ్ముఁ బ్రోచుతన్.

చ. కనుఁగవ కెంపు బొమ్మముడి గల్గి దరస్ఫురితోష్ఠమౌ మొగం
బనయము నప్రసన్న హరిణాంకరుచిం బచరించుఁగాత, మా
యనునయముల్ వృథాయిఁకఁ,ద్వదాగ్రహ మెచ్చెలుఁగావుతన్ మన
స్విని యనఁ, దేఱి గౌరి యెదఁ జేర్చినశంకరుఁడేలుతన్ మిమున్

శా. ఆనంద శ్లథ మై సమాధుల, సుమాన్యశ్రీ విలాసోల్లసం
బై, నైజోరువికారితన్ ద్రుటి వెఱంగై భ్రాంతమై స్మేర మై,
జ్యానాదం బొనరించుచో మరుఁడు రూక్షంబై, కరంగం ఘృణా
స్థానంబై, రతి యేడ్వ సాస్రి మగునీశప్రేక్ష లోముల్ మిమున్.

(నాంద్యంతమున)

సూత్రధారుఁడు—అతివిస్తర మెందుకు? దుష్టామాత్యబుద్ధివాగురా లంఘనసింహారంహుండును, భ్రూభంగలీలాసముద్ధృతాశేషకంటకుండును, సమరసాగరాంతర్భ్రమద్భుజదండమందరాకృష్టలక్ష్మీ

స్వయంవరవల్లభుండునగు శ్రీమహీపాలదేవునియాదేశంబుగాంచి తిని. పురావిదు లుదాహరించు నీప్రశస్తగాథ యాయనదేగదా!

మ. అనుకూలుండయి యాశ్రయించి గహనం బౌనార్యచాణక్యనీ
తిని,మున్నందుల గెల్చి పుష్పపురిఁ బొందెం జంద్రగుప్తుండు;గం
టునఁ గర్ణాటతఁ గాంచువారి మరలం ద్రుంపన్ భుజాదర్పమం
డనుఁ డౌ శ్రీమహీపాలదేవుఁడతఁడైనాఁ డిప్డు నిక్కంబుగన్

పారిపార్శ్వకుఁడు-(ప్రవేశించి)ఆర్యా! అమ్మహారాజు నాదేశమేమి!

సూత్ర-సుప్రసిద్ధుం డగువిజయప్రకోష్ఠునిప్రపౌత్రుం డార్యక్షే మేశ్వరకవి నవీనముగా విరచించిన చండకౌశికనాటకముం బ్రయో గించినదియని-అమ్మహాకవినాట్యవేదవిశారదులును,విద్యాకళావి దులును,లోకజ్ఞులునగుసభాసదులంగూర్చి యిట్లుపలికియున్నాఁడు

క. దోసము లేశము లేనివి
వీసంబు గుణంబు లేనివియు లే వెందున్:
దోసమును గప్పి పుచ్చుఁడు;
భాసిలఁ జేయుండు గుణముఁ బండితులారా

కావునఁ బారిపార్శ్వకా! కుశీలవులతో సంగీతము నారంభింప వేమి!

పారి-(సాశంకముగాఁ దల వాంచుకొని)ఆర్యా!ఆలకింపుఁడు. నాఁడు గ్రహణకాలమున మీరు దక్షిణ యిచ్చెద నని మాటయిచ్చిన బ్రాహ్మణోత్తముఁడు తదర్థము నేఁడరుగుదెంచి కోపపడుచున్నం దునఁ గుశీలవు లందఱు వందురు చున్నారు.

సూత్ర-(భయము నభినయించి, చింతను నటించి సహర్షముగా)- మారిషా! ఈవిషయమున విషాదంపడ నేటికి? ఇదిగో నేనిప్పుడే

ఆ. వె. ఆలిఁ జూలి నమ్మి యాత్మదేహము నమ్మి
సత్యపాలనంబు సలుపువాఁడె

నియ్యకొన్న విత్త మిత్తు హరిశ్చంద్ర
పార్థివుండు వోలె బ్రాహ్మణునకు

(తెరలో) వయస్యా ఇటు, ఇటు,

సూత్ర- (తెరవంకఁజూచి) ఓహో ఏమి? హరిశ్చంద్ర మహారాజే మహోత్పాతసూచితంబు లగునాపదలుకుశల పరిణామంబులుగాఁ బ్రబ్ధనిధిస్తరుండగుపురోధసుండు రహస్యంబున నుపదేశించిన నియమజాగరంబులం బోనరించి పర్యాకులమానసుండగుతనకుం బ్రియవయస్యుండు బోధాయనుండు దారి చూప నంతిపురము వైపున కిటు బయలు వెడలినవాఁడు, చూడు—

చ. భర మగుత్యాఁగుచేఁ దొగరుపాఱిన సోమరికన్నులం, బ్రజా
గరమున వాడు దేరుముఖ కంజమునన్, విభుఁడీతఁ డొప్పెడున్,
మరగినయాత్మ యూధమును మాపటివేళను బాసి, రేపటన్
విరహకృశానుకీలలను వేఁగుమహాగజరాజమో యనన్.

కావున నక్కడకే పోదము రా. (నిష్క్రమించుచున్నారు) ప్రస్తావన

(తరువాత జాగరఖేదము నభినయించుచు రాజును విదూషకుండును ప్రవేశించుచున్నారు)

విదూ- చెలికాఁడా! జాగారపుబడలిక గలకన్నులతో నీవదుదీర్ణము ఖం బగుతాఁబేలునుంబోలె నున్మేషని మేషంబులం గావించు చున్నను దారి గానక గుడ్డి యెలుకలాగున నిటునటుఁబరిభ్రమించుచున్నావు.

రాజు- మిత్రుఁడా! ప్రాణులకు శరీరధారణ విషయంబునం బ్రథమ కారణము నిద్రయే గదా!

ఉ. చిత్తముఁ దేలుచుం; జులుకఁజేమునసమస్తము లైన యంగముల్;
గ్రొత్త వికాసముం బ్రతిభకుం గలిగించుఁ; దొలంచుదోషముల్

బొత్తిగ; ధాతు సామ్యమును బొందఁగజేయును;ఁ వేయు నేటికి
త్యుత్తమయోగగమ్య సుఖ మొక్కటఁగూరుచు నిద్రయల్పమే?
అందుచేతనే చూడు నాకిప్పుడు—

ఉ. నిద్దురబద్ధకంబునను నెమ్మొముకిక్ విఱు పావహిల్లెడున్
దద్దయు; ఖేదభారము కతంబునఁ బ్రస్తిమితంబు చిత్తమున్;
బెద్దగ నావులింతలు జనించెడు మోమున సారెసారెకుం;
బ్రొద్దుటి లేఁత యెండ పొలుపుంగన సైఁపదు చూపులేశమున్

(ఆలోచించి విస్మయముతో) ఇప్పు డీనిశాపరి జాగరవ్రత మాదేశించుటకుఁ బూజ్యులగు కులపతుల యభిప్రాయ మేమైయుండునో? ఏమయిన నేమి? గురు శాసనములు విమర్శనార్హంబులు గావు.

విదూ—చెలికాఁడా! నే నాలోచించి చూడఁగా వాసకసజ్జిక యగు దేవి ఖండిత యయ్యెడు ననునర్థము దక్క వేఱొక్కటి యీ వ్రతమునకుఁ బ్రయోజనము గానరాకున్నది.

రాజు— మిత్రుఁడా! నీ పరియాచకములు మానుము,

విదూ— అయ్యా! నీకిది పరియాచకముగాని యనాధవటునకు నాకు మహానర్థము.

రాజు— (సోత్కంఠముగా భయమును నటించుచు) మిత్రుఁడా! దేవి యేమిచేయు నని నీ వనుకొనుచున్నావు?

విదూ— చెలికాఁడా! నిశ్చయముగా నామె కోపము చేయునని యూహించుచున్నాను.

రాజు—మిత్రుఁడా! అది తప్పదు. అందుకు సందేహ మేమి? దేవికిది సామాన్య కోపకారణము గాదు చూడు.

ఉ. మంతురు లాఁగిరో, హిత సమాజతు గోష్ఠికిఁజొక్కి నిల్చెనో,
కాంతుఁడు, వేఱొకర్తనుఁగాదని కూడెనో, రాఁడుధూర్తుఁడై

యింతకు; నంచుఁగిన్క నెఱుపెక్కిన కన్నుల జాఱువారిమో మంతయుందోఁగ నూర్చి ప్రియురాలిఁక నేమనుకోదునక్ శరుక్ మఱియు

చ. చెలియమొయార మొప్పఁగయి నేయుతమిన్ మునిమాపువచ్చి యా వలి దగుజాము నా తేరువు పైఁ గను లుంచక వెళ్ళఁబుచ్చి,యు వ్వలఁ,నిఁక రాఁడు ధూర్తుఁడని, బాష్పములూర వగక్ సడల్చిసొ మ్ములఁ, గొఱరేయి యెట్లొ గడపుం బెడపాన్పునఁ బొర్లుచున్ సఖా (చింతించి) మిత్రుఁడా! నిశ్చయముగానీలాగు నజరుగును. ఎట్లనఁగా

చ. ఉవిద మదాగమాశ యయియుండఁగ రానెవరేని, దావృథా యవిరళ సంభ్ర మోద్గమనమైనఁ, జెఱుంగు మఱుంగుగా, సఖుల్ సవసవం గాంచి యొం డొరులఁ, జప్పుడొనర్పకలోననవ్వకో, నవుదల యెత్త నోడు బిడియం వడి యాబిడ వారిముంగడక్,

విదూ-చెలికాఁడా! కడచినదానికి వగచుచు నేల యాయాసపడి యెదవు? లే లెమ్ము మన మక్కడకే పోయి దేవిని బ్రసన్న రాలిని జేసికొందము.

రాజు-(సశ్లాఘముగా) ఓయీ! నీవు బాగుగాఁ బలికితివి. రమ్ము మన మక్కడకే పోవుదము-(నడచుచున్నారు)

రాజు-(ఖేదముతో నిట్టూర్పు విడిచి) మిత్రుఁడా! తటి తప్పాటను బట్టి యిప్పుడు పోవుట నాకు ఖేద కారణము.

చ. ఎడపడునాకథం దిరిగి యెత్తుచు, నే నరుదెంచుదారిఁ గ న్నిడుకొని, గడ్డిపోఁచ చలియించిన నన్నుఁగ నెంచుకల్కి, వె నక్కడ నిభృతంబుగా నరిగి కానక యుండఁ గవుంగిలింపఁ; బ్రే ముడి విరినల్లగల్వలను బోలెడుకన్నులు మూయఁ జేతులక్.

విదూ—(నడచి తెరవంకఁ జూచి సశ్లాఘముగా) ఓహో! చెలికాఁడా చూడు చూడు. అలంకరణోపకరణంబులం గొనివచ్చెదుచారుమతితోఁ బ్రవేశించి యిదిగో దేవి ఇక్కడ నున్నది.

రాజు—(చూచి సంతోషముతో) ఆహా! ఏమీ!

చ. చెలి శరగౌరపుందళుకుఁజెక్కులఁ గూర్పదు పత్రభంగి; వీ
నులఁ గడ కొత్తు వాలికకనుంగవఁదీర్పదు కజ్జలంబు; వే
నలి కుటిలంబు ప్రేలు; నరుణం బధరం బగు ధూసరం,బిటుల్
పొలిచినఁదొంటిదేసుషమ;భూషణముంబగసేయు నాఁదగున్.

(తరువాత ముందు చెప్పినట్లు చింతను నటించుచు శైబ్యయుఁ జారుమతియుఁ బ్రవేశించుచున్నారు)

చారు—దేవీ! ఇదిగోఁ బ్రసాధనోపకరణము.

శైబ్య—(ఖేదముతో) ఓసీ! చారుమతీ! యిక్కడ నివి తీసివేయుము, నన్ను నే నెందాఁకఁ బరాభవించుకొందును? నా హృదయమున కీయలంకరణోపకరణాసక్తి నిరర్థకము.

విదూ—అబ్బో! ఈమెది గట్టిపట్టే.

రాజు—బాగు! దేవీ! బాగు! నిసర్గమనోహరంబులయిన నీయవయవంబులకుఁ బ్రసాధనోద్దేశము నిజముగాఁబరాభవస్థానమే; చూడుము.

మ. తరుణీ! నీజిగిమోవి కాశపడెడుం దాంబూలరాగంబు; సుం
దరి! కందోయిని ముద్దు; బెట్టుకొన నుత్సాహంపడుంగజ్జలం;
బురువక్షోరుహ! కౌఁగలించుకొనఁగా నూహించుహారంబుకం
ధర; నీకేటికి భూషణంబు?లవి స్వార్థం బాశ్రయించున్ననున్

విదూ—మిత్రుఁడా! మనము సమీపింతము.

రాజు—చెలికాఁడా! మన మిక్కడ దాఁగి యుండి వీరివిస్రంభసంభూషణ మాలకింతము, (అట్లు చేయుచున్నారు.)

శైబ్య—చేటీ! చారుమతి! అవ్విధమున నూఅడించియు మరల నన్నా ర్యపుత్రుఁడు విప్రలంభగోచరిం గావించెనుగదా! సర్వథా నా భాగధేయంబు లవిశ్వసనీయంబులు. వాని కీఁకఁ బదివేల నమస్కారములు.

రాజు— ఓ మనస్విని!

క. ఘనపటలాంతరితుఁడుగా
నినుఁడబ్జినీ మోము ముడువ, నేమి యుపాలం
భన మయ్యెడు నయ్యది యా
యన? కెట్టులు విప్రలంభ మది పద్మినికిన్?

చేటి— దేవీ! నీ విచారము మానుము. రాజులు బహుభార్యులు గదా!

విదూ— ఆ! బానసకూఁతురా! బహుకార్యులని చెప్పుము. ప్రియ మిత్రు నూరక యపదూఱుపాలు చేసెద వేల?

రాజు—చెలిఁ కాడా! దీనిమీఁదఁ గోపపడకుము.

క. సమయముఁగని సఖుల కదం
బము బిగితము సేయుచుండ మానగ్రంథిన్,
రమణుల మిథోఽపాలం
భమునకుఁ బాత్రత లభించు బహుపుణ్యునకున్.

శైబ్య—(ఏడ్చుచున్నది.)

చేటి—దేవీ! ఊఁఅడిల్లు మూఅడిల్లుము. అతిమాత్రమైనయమాయిక త్వము చేత నీవే మహారాజును మీఁఅఁబెట్టినదానవు. అమ్మా నీవిప్పుడు నన్నడిగితివా విను. ఆయన నిన్నుఁజూచినను నీ వాయ నను జూడకుము. ఆయన నిన్నెంత మంచిమంచి మాటలతోబతి మాలుకొన్నను దడవుగ నీ వుల్లసములాడి యాయనను ఖేద పెట్టుము.

శైబ్య- ఆర్యపుత్రునిఁ జూడఁగలప్పు డీపాడుమనస్సుమీఁద నాయధి కారము సాగిన పక్షమున నీ మాఱు నీ చెప్పినట్లే తప్పక జరిగించెదనే.

రాజు-(త్వరగా సమీపించి) ప్రియురాలా!

క. నీ కేనెపుడు విధేయుఁడ
నే కద; మత్పరత నున్న నీ డెందముపై
నీ కేమిట నధికారం
బో కంజదళాక్షి! సాగ కుండును? జెపుమా.

విదూ- దేవీ! శుభము.

(ఇద్దఱును సంభ్రమముతో నిలుచున్నారు.)

శైబ్య-(తనలో) ఓహో! ఆర్యపుత్రుఁడే! కానీ. (ప్రకాశముగా) జయము జయము ప్రాణేశ్వర!

చేటి-(భయముతోఁ దనలో) అయ్యో! మహారాజే! నేనన్న మాట లీయన చెవిని బడి యుండును. కానీ. (ప్రకాశముగా) జయము జయము మహారాజ! దేవా! ఇదిగోఁ బీఠము. దేవరయిందుఁ గూరుచుండుఁడు.

(అందఱుఁ గూరుచున్నారు.)

రాజు-(కడుదడవు దేవి వంక విలోకించి) సుందరీ! ఇదిగో నిప్పుడు-

చ. దగగొని వేగుఁబోక విరిదమ్మని దుమ్మెదకొమ్మ వ్రాలగా
నెగయు తెఱంగునన్, జిగిక నీనిక గ్రాలుదృగంచలంబుతో
సొగసుగ నాపయిం బొలయుచూపు గిఱుక్కున నుగ్రమ్ముఱించి; తే
మగపడెఁ దన్వి! నాయెడ దయ న్మరలించెదు నేర మింతలో?

మఱియు నోమనోహారిణి!

క. నగల ననాదరణము నీ
వగపఱచినఁ గొదవ యొదవ దభిరామతకున్

జిగి మేనఁ; గా నా కది
మగువా! ప్రకటించు నీదుమది మనికితమున్.

శైబ్య—దారిలనంబులైన యీయవయవంబులతోడను బ్రజాగర మంథరంబులైన యీశోణ నేత్రంబులతోడను దేవరవారు మిక్కిలి చక్కఁగాఁ గనఁబడుచున్నారు గదా! నా మాట కేమి? (కోపము నటించుచున్నది.)

రాజు— (తడవుగఁ దేఱిచూచి) ప్రియురాలా! అనుగ్రహింపు మను గ్రహింపుము.

చ. మదన జయధ్వజంబుసుమ నన్ను గువకప్రుబొమ్మ తీఁగ వీ
నుదుట నదేల తాండవ వినోదము సల్పుచు నుండెఁజండికా!
మృదుపవమాన కంపిత పరిస్ఫుట బంధుక బాంధవంబుగా
నదరెడు నేల నీ కనమయంబున నిట్లధరోష్ఠబింబమాన్.

(దోసిలిపట్టి)

ఉ. కమ్మపసన్న పూర కలుకన్ వహియించెద వేల కోపనా
యెమ్మెయి నెంచితీవు నను నే నటు గా నిది నమ్మవేని దం
డమ్ము విధింపు పాలినటు నాకు గుణాగుణనిర్ణయమ్ము నం
దుమ్మహనీయు లాకులపతుల్ బలితంపుప్రమాణమయ్యెదర్

(ప్రతీహారి ప్రవేశించి)

ప్రతి—జయము జయము మహారాజ! ఇదిగోఁ గులపతులసన్నిధినుండి యొక తాపసుఁడు వచ్చియున్నాఁడు.

రాజు—హేమప్రభా! ఆలసింపక సాదరముగాఁ బ్రవేశపెట్టుము.

ప్రతీ—దేవా! చిత్తము చిత్తము. (నిష్క్రమించెను.)

(తరువాత శాంత్యుదకమును జేతఁ బట్టుకొని తాపసుఁడు ప్రవేశించుచున్నాఁడు)

తాప—(విస్మయముతో) ఆహాహా!

సీ. ఇదియేమి యాశ్చర్య మిందు బింబముమిగ్రింగెఁ
బర్వంబుగా కెన్వర్భానుఁడొడిసి

యేమీ మహాఘోర మీదేశావలయంబు
కావిరుల్ గ్రిమ్మంగఁ గాలఁదొడఁగె
విద్దూర మేమయో వెసలదొంతులు వోలె
బృథు సౌధములుగూలఁ బృథివి యూఁగు
నెగసి యుల్కాదండ మే మిట్టు ఖండించె
రెండుగా మార్తాండ మండలంబు
దారుణోత్పాతములు గదా తలఁప నిన్ని
గంచుదివియల వెదకినఁ గనికరంబు
గానఁగారానిహత విధికపట మకట
యేమి మూఁడింప నున్నదో యింక మీఁద.

అయినను గురు జనుల పరామరికవలన నివియన్నియుఁగుశల పరిణామములే కాగలవు.

తే. గీ. శాంతివలనను బ్రాహ్మణస్వస్తివాచ
నంబువలనను స్వస్త్యయనంబువలన
దానమున సజ్జనాను కీర్తనము వలన
క్షమ మహోత్పాతదుస్స్వప్న శమన మగును

అందుచేతనే మహానుభావులయిన కులపతులు సర్వోత్పాత ప్రశమనంబుగా నిజారబ్ధస్వస్త్యయన కర్మ శేషభూతంబగునీ శాంత్యుదకమును రాజునకును రాణికిని నిచ్చి రమ్మని నన్నంపినారు.

ప్రతీ—(ప్రవేశించి) అయ్యా! ఇటు, ఇటు. (నమీపించుచున్నారు)

తాప—(నమీపించి) రాజా! నీకు శుభము.

రాజు—(తొందరగా లేచి) స్వామీ! నమస్కరించుచున్నాను.

శైబ్య—మునీంద్రా! ప్రణమిల్లుచున్నాను.

తాప—రాజా! జయశాలివి గమ్ము. సాధ్వీ! వీర మాతవు గమ్ము.

రాజు-(తొందరగా) పీఠము, పీఠము.

ప్రతీ-(పీఠము గొని వచ్చుచున్నది)

రాజు-స్వామీ! ఇదిగోఁబీఠము కూరుచుండుఁడు.

(అందఱు గూరుచున్నారు.)

రాజు-హేమప్రభా! నీవు ద్వారము కడనుండుము.

ప్రతీ-చిత్తము దేవా! (నిష్క్రమించుచున్నది)

తాప-రాజా! మహాత్ము లయిన కులపతులు తమ యాశీస్సులవలన నుత్కృష్ట ప్రభావ సంపన్నంబు గావించి నిశాప్రజాగరాంతంబునఁ గాంతాసహితంబుగా నీవుశిరస్సునఁ జల్లుకొనుటకు స్వస్త్యయన శేషము నీశాంత్యుదకము నంపినారు.

రాజు-(హర్షముతో దోసిలిపట్టి) మహాప్రసాదము.

తాప-

మ. శమితాంహశ్చయ మంత్రపూతమునుబుష్యష్టాక్రతేజోనలం
బమిత ప్రోన్ముఖ దుర్విపచ్ఛమనసం ప్రారబ్ధసత్కర్మ శే
ష మనిర్వాచ్యమహత్త్వమీయుదక మైశ్వర్యంబు నీకిచ్చెడున్
బ్రమదంబుంబొనలించుఁగాత మఖిలాపత్తుల్ నివారించుతన్.

(శిరస్సునఁ జల్లుచున్నాఁడు.)

రాజు-(స్పర్శము నభినయించి) ఆహాహా!

క. అలక్షతప్రబీజమునకుం
గలుగం బ్రసవాంకురంబు కారణమిదిఁ వే
వెలుఁగుఁగొలముతేం డ్లెత్తుగఁ
దల దీపప్రసాదమునఁగదా యెత్తిరిలన్,

తాప- పూజ్యురాలా! శైబ్యా! కులగురువుల యాదేశంబున గృహదేవతలకును భూదేవతలకును నవిశేషముగా నీవును సమారాధనముల జరపవలయు,

శైబ్య-(దోసిలి పట్టి) స్వామీ! చిత్తము.

తాప-రాజా నీకు శుభమవుగాక. నేను ప్రారబ్ధవివిధ విధివిస్తరులగు కులపతులసంభావింపనరుగుచున్నాఁడ(నిష్క్రమించుచున్నాఁడు)

శైబ్య-(వైలక్ష్యముతో) ఓసీ చారుమతికా! ఆర్యపుత్రునకు నిశా ప్రజాగరము మహానుభావులు కులపతులే యాదేశించిరి,అయ్యో! నమ్మకములేని యీ పాడుమనస్సు నన్నెంత దురాత్మురాలిని జేసినదే, కాని, ఈలాగు చేసెదను (దోసిలిపట్టి ప్రకాశముగా) ఆర్యపుత్రులు నన్ననుగ్రహింతురుగాక.

రాజు-(అనురాగముతో) ప్రియనీ!

ఉ. చెన్నఁటితప్పిదానఁ గలుషీకృత చిత్తుఁడ నయ్యునాకు నో
యన్నులమిన్న! నీయనునయం బిది గ్రాహ్యమయందు వేనినీ
ప్రన్నని చెక్కుటద్దములఁబత్రములన్ రచియింతు ముత్తెపుం
బన్న నరంబుఁ గంబుసుషమం బగుకంఠమునన్ ఘటింపుదున్,

శైబ్య-(సిగ్గుపడుచున్నది.)

రాజు-(అట్లు చేయుచు) ప్రియురాలా!

చ. చెనురు గగుర్పు నీకు జిగి చెక్కుల, నాకు వడంకు గేల. నే
క్రమమునవ్రాయ నౌమకరికల్?సకలంబు వృథాశ్రమంబుహా
రముమెడఁ గూర్పఁగా నదితరంగితమాచుఁగుచాగ్రసీమఁగం
పమును మదీయహస్త సహవాసభవంబును మాన దుగ్మలీ.

శైబ్య-ఆర్యపుత్ర! కులపతు లానతిచ్చినట్టు లాచరింపఁ బోవుచున్న దానను. (ఇద్దఱును నిష్క్రమించుచున్నారు)

రాజు-మిత్రుఁడా! సోత్కంఠుఁడ నైననే నేలాగునఁ బ్రొద్దుపుత్తును.

విదూ-చెలికాఁడా! నీవు దేవి మాటలను జెప్పుకొనుచు సంతోషింపుము? నేనును భోజన ప్రసంగముతోఁ గాలము పుత్తును.

వనచరుఁడు-[ప్రవేశించి] జే జే దేవరా! అవధారు సామీ! బెట్టి దవు ముట్టియకొట్టకోనం బిట్టు గ్రోడాడుతుంగపట్టులం బుట్టినసెత్తావి వెల్లువపొత్తునం బెల్లువలచు నూర్పు గాడ్పులు దంతయంత్రాం తరవర చర్వ్యమాణంబు లగు తెల్లని కొట్టిగడ్డలపిండి యిట్టట్టుఁ జెదరివిప్రకీర్ణ ప్రతిపక్షజయో పార్జితని జయశేరి పటలంబునుం బోలెఁ గాలఁ మేఘంబునం గురుయుకరక వర్షంబునుం బోలె దశదిశభాగంబులం గప్పఁ బెద్ద కాలంబునుండి మెండుకొనియున్న వేరంపుఁగారణంబునంజేసిరోసంబునం బూర్ణ శశాంకమండలంబు నుండి నిండుబలిమిం గళాయమళంబుఁ బెకలించి కబళించెడుతూది రేయిటికటిచీకటి మొత్తమునుంబోలె దశనాంత రాళఖండనభయకుండలాయితమృణాళ దండభాసుర కరాళవికటదంష్ట్రాయుగళంబునముఖమండలంబు దీపింప, నే పారుకోపానలంబు సిగయునుం బోలెఁ దరలతరజిహ్వాప్రవాళంబు గ్రాల విద్రావితవనసింహ సంహతి యగు నిజగర్వగంభీరఘుర్ఘురారావంబునం బెదరి తమ తమ జాతి కనుగుణంబుగా వా పోవు నా భీల శార్దూలాది వ్యాళ జాలంబుల కోలాహలం బాలకించియా గ్రహించి ఆకిక్కించినకర్ణద్వయంబు ముత్తియపుఁజిప్పదోయిం జప్పటలు నఱవరూక్షతర పింగాక్షి విక్షేపం బగునిశితవా క రవాలవిమలేంద్ర నీలకజ్జలత మాలశ్యామలస్థూల కాయంబు స్ఫులింగ శేషం బగుదవదహన మషీరాశినీనడింప, వికట తటిచ్ఛటాకడార కేసక కలాపంబున నిరంతరపరిస్ఫురద్వనలగ్న దావానలోద్గారభాస్వరంబయియవ తారితధరావలయలీలాసముత్థితంబగుమహావరాహంబునుం బోలె నొకవరా హయూథాధిపతి మృగవ్య భూమి నిబ్రవేశించెను. అవధరించి దేవర చిత్తానుసార మాచరింపుఁడు నేను నక్కడకే పోవు చున్నాను.

రాజు-(సంతోషముతో) ఆహా! నాకిప్పుడు వినోదస్థానము లభించినది.

విదూ-[కోపముతో] ఓహో! చెలికాఁడా! ముల్లుకంపలలోను తెల్లు దుబ్బులలోనుబడి మిట్టుపల్లంబు లనక యాఁకలిదప్పులకు లోఁగుచునడవుఁలలోదిరుగులాడవలయుటంబట్టిబహుప్రత్యవాయంబునాఁ జను వేటయే నీకు వేడుక పట్టయిన పక్షమున నింక లోకములో నాయానస్థాన మేది యుండును?

రాజు-మిత్రుఁడా! రాజులకు వేఁట యత్యంతోపకార ముగదా! చూడు —

చ. అలఁదురుమానసంబునకు హాయిఘటించుఁ; జలించులక్ష్యమం దలవడుచుర్ స్థిరత్వ మఖిలాంగము లాఘవ మొందఁజేయు నెక్కొలువుఁగడంకబుద్ధిఁ;గలఁ కుంబలెనెంతయు యోగ్యమింతయుం దలఁపక వేఁట నంద్రడు వ్యసనం బిది రాజులకంచుఁబండితుల్ కాఁబట్టి రా మన మక్కడకే పోవుదము.

[అందరు నిష్క్రమించుచున్నారు]

శ్రీ పరమాత్మనే నమః

# హరిశ్చంద్ర నాటకము

## ద్వితీయాంకము

[తెరలో] ఓహో వరాహాన్వేషులారా!

మహాస్రగ్ధర.

కలఁచుంబంకంబుఁ, ద్రెంచుం గమలిని, నమలుంగందళన్ముస్తకంబుల్,
జలమీఁదుంగూల నొడ్డుల్, స్థపుటములుగ మస్తాస్థలుల్ సల్పుఁ, దూటెం
బలుగోసం, దక్కెఁడక్కెం, బఱచుఁబరుచు వేభల్లముల్ చిమ్ముఁడంచుం
బలముల్ నెన్నాడి గాలింపఁగఁ జొరఁబడెడుం బందికాంతారభూమిన్
కాఁబట్టియడవుల నెల్ల నరికట్టవలయును.

సీ. గహనావరోధధూర్వహజాలికులు జాల
బంధంబులును బొంతఁ బన్నవలయు
భషకసంఘులు వనాభ్యంతరంబున జాగిల
ములపట్టైడ లెడల్పంగవలయు
నలయ వాజులు వనస్థలము లెల్లను బాశ
హస్తులు రాహుత్తు లలమవలయు
దండముల్ పూనుదుంతుల రౌతు లంతకుల్
బలెగాన గజిబిజింపంగవలయు

మందరాచల మంథానమథ్యమాన
కలశపాథోనిధానంబు దలఁపు రాఁగ
నధిక వనసత్వ సంక్షోభమావహిల్ల
ధీరలుబ్ధక వారంబు దరుగవలయు.

[తరువాత శాౡద్రోజ్వల వేషుండయి సంభ్రమించుచు
విఘ్నరాట్టు ప్రవేశించుచున్నాడు.]

విఘ్న–[సాశంకముగాఁ దనలో]

చ, హరునిసమాధికిన్ శివులయంగజ కేళికి దత్తు నల్పన
ధ్వరమున కంతరాయము నెవండు ఘటించె, జగత్త్రయిన్ నిరం
తరము సమాచరించెడు హితవ్యవసాయపుఁబంట మాపుకే
పరమవిలాసమై యెవఁడు భాసిలు, నేనలవిఘ్నుఁడంగదా.

కావున నేనిప్పుడు—

చ. జలజజశార్ఙి శంభులయసాధ్యపువిద్యలు మూఁడు నగ్రపుం
బలువుఁదపంబునం బడయు వాఁడగు తాపసునుండి ముజ్జగం
బులను సముద్ధరింతు గిటిమూర్తిని గ్రీడ మెయిం ధరించుచున్
బ్రలయమునందు నాదిమవరాహతనుండు ముకుందుఁడుంబలెన్.ర

అట్లుచేయుట యుక్తమేగదా!

చ. భువనములన్ విధాత నలుపున్,హరిగాఁడు హరులుండుగాఁడు;కే
శవుఁడు భరించు గోత్తయని, శంభుఁడుగాఁడు విరించి గాఁడుమా
ధవుఁడుహరించు హర్తయవి,ధాతృండుగాఁడు విధుండుగాఁడసం
భవమగుఁగాక యొం డొకని పట్టున నెట్లఖిలంబు సిద్ధియౌ.

(ఆలోచించి) అయినను బరమనైష్ఠికుఁడగు నీతనియం దసంభావ్య
మొకటియుండదుగాని మునిస్వభావంబులు సులభకోపంబులని
యుఁ గామక్రోధంబులు శ్రేయఃపరిపంథు లనియు నిక్కార్యంబు
నకుఁగడంగితిని, ఫలిత మెట్లుండునో యెఱుంగఁజాల.

[తెరలో] అతినిబిడవనాంతర్ధానగర్వితా! వరాహాధమ! ఉండుండు.

చ. కనఁబడుచుం నిమేషమునఁగన్ను మొఱంగుచునో పిసాళి! మా
యను గయికొన్నచందమున నక్కట! నన్నెలయించి దవ్వుగాఁ
గొని చనుదెంచి తేల నుడుగుల్ వెయి? నీ విపు డింత నాదుకం
టను బడి తేని దామరవనంబుల నింకిటఁ ద్రుంప వెన్నడుర్.

విఘ్న—(విని హర్షముతో) ఓహో! ఇతఁడు సమీపించెనే. నే నిపు డీలాగునఁబోయి యెప్పటిమాయనే యవలంభించికనఁబడెదను

(సత్వరముగా నిష్క్రమించుచున్నాడు.)

(తరువాత విల్లుపూని వెంబడించుట నభినయించుచు రథమెక్కి-

(రాజును సారథియుఁ బ్రవేశించుచున్నారు.)

రాజు—(కనఁబడుచుర్ నిమేషమున" అను పూర్వోక్తపద్యము పఠించుచు ముందుచూచి సంతోషముతో) ఆర్యా! ఆర్యా! వరాహము మనకుఁ జేరు నున్నట్టేతోఁచుచున్నది—చూడు.

చ. నమలుతఱిం దొరంగు కువణంపుబిసంబులు గప్పెనీవన
క్షమను గలంగి పాఱు నుదకంబుల ధార లివే నరస్తటిక్
శ్రిమగళితోరు ఫేనముల శాద్వలముల్ శబలంబు లిందు, సాం
ద్రము ధృతముస్తసౌరభము తచ్ఛ్వసితంబుల మారుతం బిటన్.

(మరల నిపుణముగాఁ జూచి సంతసముతో) ఆర్య! ఆర్య! ఇదిగో నది, చూడు చూడు.

ఉ. జోక మెడం గదల్చుకొనుచున్ వెనఁద్రవ్వినదుంపతోడిప
ర్యాకులలోలనాలవికచాబ్జము నోరను బూని, లో నిగూ
ఢాకృతియైన నాభినల మాననపద్మముఁ జేర వెండి దం
ష్ట్రాకలితక్షమోద్ధృతిని గ్రాలుమహాకిటి నాఁదవచ్చెడున్.

సూతు—(సకౌతుకముగా విలోకించి) ఆయుష్మంతుఁడా! చూడు చూడు.

మ. తిరుగం గ్రొవ్వున వచ్చి లక్ష్యమయి భీతిం దోనవెన్దీసి ముం
దరిపాదంబులు సాఁచి, కుంచుచరమార్థం బీడ్చుచున్ ముందుకున్
ద్వరితశ్వాసవిదీర్ణ సృక్వవివరభ్రశ్యద్బిసాంకూర మా
విరిగోఁటం దరిసించు నీ కన గతవ్రీడావిలక్షాన్యమై.

రాజు—(బాణమోక్షమును నటించుచు సమీపించి యంతటఁజూచి యాశ్చర్యముతో) అయ్యో! యీనిమేషముననే మాయమై పోయినదీనిమీఁద ననవసరమున బాణమోక్షము గావించితినే.

చ. కను మొఱఁగుఁ క్షణంబు, క్షణకాలముద్గ్రీవయంబగుఁ, మఱిన్
జనుఁగడుదవ్వుగా, మరల సన్నిధియందుఁ జరించుఁ, గ్రమ్మఱన్
వెనుకను బ్రక్కనంతటను వెండి బ్రమించు, మెఱుంగువోలెని
ల్వని దగుదీని నెక్కరణి లక్ష్య మొనర్తునొ తోఁప దేమియున్.
(నిపుణముగా నరసి దూరముచూచి యానందముతో)

ఓహో! వరాహ మీమహారణ్య మతిక్రమించి ప్రసన్న భూమి నధిరోహించినది. ఆర్య, ఆర్య! గుఱ్ఱములను వేగముగాఁ దోలుము. ఇక నిది యెందుఁ బోఁగలదు?

సూతు—(అట్లు చేసి రథవేగము నభినయించి) ఆయుష్మంతుఁడా! చూడు చూడు.

చ. వెనుకను బెందుదూరమున వీచెడుగాలిని మీఱుచున్ వడిన్,
మునుమున లక్ష్యముంగలయఁబోయెడునామది వెన్నడించుచున్,
దనయచలధ్వజాంశుకము దాఁకఁ బయోదము నీశరాళితో
డను సరిగాఁగ నయ్యయియెడన్ భవదీయరథంబు ప్రాలెడున్

రాజు—(విస్మయముతో) ఏమిది!

చ. చదలఁ జరించుచుం బవనజైత్రజవంబున నంబురాశి గో
ష్పదముగఁ జౌకళించురథవాజులతోఁ దనుఁ గూడముట్టునా

కదిర!విభిన్న కజ్జలచయప్రతిమానవినీలకాయ మీ
కొదమవరాహ మర్త్యమునకుం దమమట్లులు దూరమూర మా.

(ముందుచూచి ఖేదముతో) అయ్యో! యీమహారణ్యము నతిక్రమించి వెంటనే యదృశ్యం బయిన దీని యడుగులజాడ యయినను గానరాకున్నది. కానీ, ఇదిగో నెట్టయెదుటఁ దిన్నగా నున్నయీ యరణ్యరేఖ నిప్పు డన్వేషించెదను. (అట్లు చేయుచు సంతోషముతో) ఓహో! యిది తపోవనోపకంఠము గావలయును. నిశ్చయమే.

చ. ఒకయెడ వేళ్ళతోఁ బెఱికి రొక్కెడఁగోసిరి దర్భబీళ్ళు; పూ
లకు దయ నందుకో రివటలన్ లత లిం దిసుమంత వంగె; నో
ల్చికొనుటఁజేసి వల్కలముఁజెట్లిట గాయపడెన్; దొరంగుపాల్
ప్రకట మొనర్చు నీతరువరంబుల నిప్పుడె తుంచు టిధ్మముల్

(అంతటఁజూచి సంతోషముతో) ఆర్యా! చూడు చూడు.

చ. చిలుకలు స్వాగతంబును వచించుఁ గదంబపుఁదొట్టబోదియల్;
దలఁపు హరించుఘ్రాణమును దన్పుచు హవ్యసుగంధవాయువుల్;
జలపులినప్రదేశజకుశం బగునిర్ఝరతోయ మీకురం
గులు మనవంకఁ గన్గొనుచుఁ గ్రోలు భయాతివిలోల దృష్టులన్.

సూతుఁడా! యాశ్రమోపాంతసంచారియగునీవరాహమునిఁక వెదకఁ దగదు. నీవిప్పుడు గుఱ్ఱములనునీరు ద్రావించి విశ్రమింపంజేయుము. ఇంతలో నేను నాయుధమాత్రసహాయుడనై యాశ్రమమునం బ్రవేశించి తపోధనుల కభివాదనంబు గావించి వచ్చెదను. పూజ్యులకు సపర్యగావింపమి శ్రేయోవిఘాతంబుగదా!

సూతు—చిత్తము దేవా! (నిష్క్రమించుచున్నాఁడు)

రాజు—(చింతను నటించి సశ్లాఘముగా)ఆహా! యేబెడఁదల నెఱుం

గమింజేసి యీ జడదారుల మొగంబు లెంతరమణీయంబులై యొసంగుచున్నవి!

మ. గతసంకల్పతఁ గోరఁబోదు మది భోగంబుల్; మమత్వంబు పర్జితమై యేగుటచే వియోగములపై స్నేహంబులున్ గా వహంకృతిఁ దూలించుట స్వాన్యభేద మనుమాటే లే దనిర్వాచ్య మానతిశాంతిం ఘనులౌ తపోధనులు సౌఖ్యశ్రీవిధానుల్ గదా.

(వినయముతో నడిచి భయమభినయించి సాశంకముగా) అహో! యేమిది! అవినయదురాలోకంబులైన యీతపోవనంబు లపూర్వంబు లగుటంజేసి సాపరాధులకుంబోలె సాధ్వసముం గలిగించుచున్నవి. తేజస్సులలో సర్వాభిభావియు ననభిభవనీయంబును నగుతపోమయబ్రహ్మతేజం బనిర్వచనీయంబు గదా!

క. అడుగడుగున జడు పిడు నా
కడవి పరిశాంతము మనోజ్ఞ మయ్యును, మెత్తం
బడు నెల్ల తేజములు తమ
పొడమినకడ నిప్పు నీటిపొందునఁ బోలెన్.

(భయముతో నడుచుచున్నాఁడు)

(తెరలో) ఆర్యులారా! రక్షింపుఁడు రక్షింపుఁడు, ఏయపరాధము నెఱుంగని యనాథల మశరణ్యులము; అయ్యయ్యో! యతిదారుణముగా నగ్నిహోత్రమునఁ ద్రోయఁబడుచున్నారము. మందభాగినులను మమ్ము రక్షింపుఁడు రక్షింపుఁడు.

రాజు—(విని యవష్టంభముతో) ఓహోహో! చేరువ నీవైపున భయార్తిం గూరిన యాఁడువారలదియుం బోలె నంగ లార్పు వినవచ్చుచున్నది. (అచ్చెరువుతో) ఏమిది! ఇది తపోవనమే. ఇటువంటియవినీతుల కిక్కడ సంభవ మెట్లు? కానీ సమీపించెదను.

(అటు చేయుచున్నాఁడు)

[తెరలో దొంటియట్లే వినఁబడుచున్నది.]

రాజు—(విని సావష్టంభముగా) భయార్తుల కభయ మభయము, క్రోధముతో) హా!

ఉ. క్రూరుఁడనాత్మనీన మతిఘోరము నీఖలకర్మముంద వ
శ్చారివనీవిరుద్ధము నృశంసము నెవ్వఁడొనర్చు, వాని నా
దోరసి గొంతుఁ గోసిమెయి తునకలు తునకలు చేసి యుజ్జ్వల
ద్భైరవవహ్నికీలలను భస్మముగా నవియెల్ల వ్రేల్చెదన్.

(నడచి తెరవంకఁజూచి విస్మయముతో) ఓహో! యగ్నిహోత్రి మధ్యంబున నాసీనంబయి భయార్త నంగలార్చుచు దివ్యరూపంబునం దేజరిల్లునారీత్రయంబుతో సన్నిహితహోమసాధనుండయి యగ్నిశాలయం దున్నవీఁ డెవ్వఁడయి యుండును? నిజముగా వీఁడు తాపసవేషధారి యగుకొండొక పాషండుండుగావలయు.

(తరువాత హోమము నభినయించుచు విశ్వామిత్రుండును, యథానిర్దిష్టముగా విద్యలును బ్రవేశించుచున్నారు.)

విద్య—(సంభ్రమించుచుఁ బూర్వోక్తము పఠించుచున్నారు.)

విశ్వా—(ఆశ్చర్యముతో) ఓహో! యేమి చెపుమా.

ఉ. పూనె హవిస్సు మంత్రపరిపూత ముపాంశున నేనొసంగఁగా
నైనను గాఁడు లేశము హుతాశనుఁడియ్యెడ దక్షిణార్చి; హే
చ్చైనకిర్యాప్రభావమున నద్ధిర! యొద్దకు నేగుదెంచి రీ
చానలు విద్యలైనను వశింపడ కుందురు నా కిదేముకో.

(సమాధి నభినయించుచున్నాఁడు)

విద్య—(పూర్వోక్తము పఠించుచున్నారు)

రాజు—(సత్వరముగా సమీపించి) భయార్తులకభయమ భయము. అరే! దురాత్మ! పాషండాధమా! నిలు నిలు, ప్రచ్ఛన్నరాక్షసుండ వగునీమాయాప్రపంచ మిదియేమి?

ఉ. కేల వరాక్షమాల, తలఁ గెంజడలున్, మొల వల్కముల్, దప
శ్శ్యాలుల దైనయీపరమశాంతపువాలక మేమి? యోరిచం
డాల! జుగుప్సితం బకరుణం బగు స్త్రీవధ, పాతకోత్సవో
ద్వేలమనం బిదే మనుభవింపుము కర్మఫలంబు నిప్పుడే.

విశ్వా—(సంవరణము నభినయించుచుఁ గ్రోధముతో)

మ. అసకృత్కర్ణకఠోరభర్త్సనమిష వ్యాఘట్టజుం డాంతర
ప్రసభక్షోభసమాధి భంజనభస్వద్భాస్వరద్దీప్తి నా
యసదృక్క్రోధజజాతవేదుఁడు సమిత్ప్రాప్తిన్ క్షయస్పర్శన
ప్రసరోద్యత్ప్రలయాగ్ని నాఁ ద్రిభువనగ్రాసేచ్ఛ నేఁ డీగుతన్.

విద్య—[సంతోషముతో] మాకుఁ బ్రియము, మాకుఁ బ్రియము
జయము జయము హరిశ్చంద్రమహారాజ! [నిష్క్రమించిరి]

విశ్వా—[చూచి క్రోధముతో] అహో! యేమిది! దురాత్ముఁ
డీహరిశ్చంద్రుఁడే మాకు శ్రేయోంతరాయుఁ డైనాడు. అరే!
క్షత్రియాధమ! నిలు నిలు.

ఉత్సాహ. హరివి యగుదు గాక, చంద్రుఁడగుదు గాక, చంద్రమో
ధరుఁడుహరుఁడె యగుదు గాకఁ దానికేమి మూఢ, యీ
పరమవిద్య లంతరింపఁబట్టి బెట్టిదంబు గా
నెరియు సాదుక్రోధవహ్ని కింధనంబు గావు రా.

ఓరోరిదురాత్మ!

శా. జాయా కేళిమయుండు భూతకరుణా శాంతుండు దా నయ్యుఁగ్రీ
డాయత్తాత్మసమాధిభంగవిరసాస్య భ్రూకుటీభీషణుం
డై యాకృష్టశరాసు మారుఁగని ఫాలాక్షుం డెటుల్ చేసెనో
చేయుం గౌశికుఁడట్లె నిన్నిపుడు దృష్టిం గ్రోధభూయిష్ఠ డై

రాజు—(సంభ్రమించుచుఁ దనలో) అయ్యో! యేమిది! ఈయన భగవానుఁడు కౌశికుఁడా? వారు పూజ్యరాండ్రు విద్యలా? వారి సిద్ధికిఁ బాపాత్ముఁడను నేనీయన కంతరాయ మైతిని గదా! నిజముగా నింధనప్రాయుఁడను నే నవివేకంబునం బ్రస్ఫురచ్ఛిఖాకలాపం బగు జ్వలనంబును ద్రొక్కితిని.

విశ్వా—(క్రోధముతో)

చ. కడఁగినసాధనం బిటు విఘాతము నొందుటఁ గ్రోధమెచ్చి నా
కుడిచెయి గాంచుశాపమునకుం గడు వేగిరపాటు; నెన్నఁడో
విడిచిన దల్లజాతిఁ దలపెట్టుచుఁ దానును సాహసాంక మీ
యెడమకరంబు చాపమున కెంతయు నేడ్తెఱ నేయు నిత్తరిన్.

(లేచుచున్నాడు)

రాజు—(భయముతో సమీపించి) స్వామీ! నమస్కరించుచున్నాను.

విశ్వా—(క్రోధ మభినయించుచున్నాడు)

రాజు—(పాదములం బడి) భగవానుఁడా! క్షమియింపుము క్షమియింపుము. స్త్రీజనార్తప్రలాపమాయావంచితుండనయి యెఱుంగనివాఁడ నయిన నన్ను క్షమియింపం దగును.

విశ్వా—ఏమీ! "యెఱుంగనివాఁడ నయిన నన్ను క్షమియింపం దగు" ననెదవుగా; ఓరోరి క్షుద్ర! నన్నే నీ వెఱుంగవుగా!

ఉ. జాతిస్వయంగ్రహంబున నెసంగిన దుర్లలితైక విప్రుఁడన్
బోతరవున్వసిష్టముని పుత్రులకానకు వీతిహోత్రుఁడన్
నూతనసర్జనోద్యమ వినోదనభీతజగత్కృతాంతుఁడన్
ఖ్యాతమతంగ యాజకుఁడ గౌశికుఁడన్ నను నీ వెఱుంగవో.

రాజు—తాపసోత్తమా! ప్రసన్నుఁడ వగుము ప్రసన్నుఁడ వగుము
స్వామీ! నీ కిట్లాగున నన్నుఁ దగునా?

ఉ. అన్నము లేనికాటకమునం దటు జీవిక గన్న వాని, భూ
భృన్నివహాపతిగ్రిహణ వృత్తికిఁ జిత్తము రోయువాని, నో
సన్నుత కీర్తి! యాడి బకసంగరకంపితజీవలోకునిన్
నిన్ను మహాత్త పోనిధిని నేల నెఱుంగనివాఁడు గల్గునే
భీరుజనార్త ప్రలాపంబు నాలకించి యాలాగునఁ గావించితిని. స్వ
ధర్మాక్షిప్త చేతసుండనయి యెఱుంగనివాఁడనయిన నన్ను క్షమి
యింపం దగునని విన్నవించుకొనుచున్నాను. మహానుభావ!

విశ్వా—ఏమీ! "స్వధర్మక్షిప్త చేతసుండనా?" దురాత్మా! చెప్పు చెప్పు ఏదో నీ ధర్మము?

రాజు—మునికులోత్తమ! మనవి చేసికొనుచున్నాను, చిత్తగింపుము.

క. ఈయంగవలయు రక్షణ
సేయంగను వలయు, రణముసేయఁగ వలయున్
రాయలకు నిత్యధర్మం
బీయది యని పలికి రాదిఋషి మూర్ధన్యుల్.

విశ్వా—ఏమీ! "ఈయంగవలయు" ఇత్యాది పద్యము పఠించుచున్నాఁడు.

రాజు—మఱేమి?

విశ్వా—అట్లయినం జెప్పు—ఎవని కీయవలయు? ఎవ్వాని రక్షణ సేయవలయు? నెవ్వనితో రణము సేయవలయు?

రాజు—భగవానుఁడా! ఆలకింపుము.

విశ్వా—ఊఁ. మఱి చెప్పు

రాజు—క. ఈవలయును సద్ద్విజులకుఁ,
గావవలె భయార్ద్రితులఁ, బగఱతో రణమం
గావింపవలయు; నీయది
భావముద్భృథపఱచుకొన్న పద్ధతినాకున్.

విశ్వా—మహాత్మా! నీవట్లే దృఢపరచుకొన్న పక్షమున మాకు విద్యా తపోనురూపముగా నేమయినఁ గొంచె మొసఁగవలయు.

రాజు—(సంతోషముతో) ఓహో! భగవానునిచే వైవస్వతవంశ మనుగృహీతముగదా! స్వామీ! ప్రసాదింపుము.

ఉ. దేవర సత్కరించుటకుఁ దిన్నగ, లోకములన్ని చాల విం
కావల నేమి యుండు? బిడియం బగు నాయఖిలంబు నిత్తు నా
నోవిబుధాగ్రణీ! యయిన నోపినయీవి ప్రతిగ్రహింపుమీ
భూవలయంబు సర్వధనపూర్ణ మశేషము నీకొసంగితిన్.

విశ్వా—[ఆశ్చర్యముతో తనలో] కానీ నే నీలాగు చేసెదను. [ప్రకాశముగా]రాజా! స్వస్తి సరియేగాని యదక్షిణపుదాన మందురు. కావున దక్షిణ కూడ నిప్పు డీయవలయును.

రాజు—[సిగ్గుపడుచుఁ దనలో] ఈయెడఁజేయఁదగిన దేమి! [చాలఁగ నాలోచించి సంతోషముతో] కానీ, ఈలాగునఁ జేసెదను. [ప్రకాశముగా] ఓ మహాభాగ !

క. గడియించి లక్ష హేమము
లిడుకొనియెద దక్షిణగ ఋషీశ్వర మీకున్
దడ వనక కనికరంబున
గడు వొసఁగుఁడు నేఁడు మొదలుగా నెల నాకున్.

విశ్వా—ఈగడువు మాకు సమ్మతమే కాని పుడమిని విడిచి యెుండు కడం గడియించి యొసంగవలయు.

రాజు—[సాశంకముగాఁ దనలో] ఇందుకుం బ్రతివిధాన మేమి [ఆలోచించి హర్షముతో] ఓహోహో ! ఎంత చక్కని ప్రతి క్రియ స్ఫురించినది. విశ్వేశ్వర పరిగ్రహం బయిన మహాక్షేత్రము కలదు గదా?

చ. తలఁచుచు వారణాసివసుధాతలభాగవిభిన్నభావముఁ
బలుకుదు రంతరిక్షమునపట్టణమంచును దానిఁ గోవిదుల్;
దెలియదు రాగమార్గచరదృష్టిఁ గచాగ్రసహస్రభాగసూ
క్ష్మలవతులాంతరాళమును సం యమివర్యులు శ్రద్ధధానులై

కాఁబట్టి యీయన దక్షిణ నే నం దార్జించి యిచ్చెదను. [ప్రకాశముగా] స్వామీ! తమయాజ్ఞకు బద్ధుండను.

[ఆభరణములను దీసి] మహాత్మా!

ఉ. ఈయఖిలంబులై నసిరు లీవసుధావలయం బశేష మీ
యాయుధముల్ సమస్తము, ధరాధిపలాంచన మీకిరీటముఁ
మీయవి; నే నిదే మరల మీమృదులాంఘ్రుల కప్పగించితిం
జూ, యమివర్య! సాదరపుఁజూపున వీని ననుగ్రహింపరే.

[పాదంబులం బడి లేచి సంతసముతోఁ దనలో] ఆహా! ఆయాసభూయిష్ఠం బయినను సదృష్టవశంబున రాజ్యభార మిప్పుడు నాకు సఫల మయినది.

ఆ. వె. ఎడఁద నేది పెద్దపిడుగనుకొంటినో
యట్టిగాధితనయునాగ్రహంబు
చల్ల చల్ల జారి జాజిపూవులదండ
యగుచు నాదుశిరము నందుఁ బడియె.

[దోసిలిపట్టి] భగవతీ! వసుంధర! ఇదిగో! నిన్ను వీడుకొనుచున్నాను.

ఆ. వె. దేవి! లోకధాత్రి! వైవస్వతులు నృపుల్
వీరకీర్తి నేలినారు నిన్ను;
సరిదిపాత్రమునకు మరగి నే విడితి; నా
యేకదోష మిది సహింపవలయు.

ఇఁక నేను త్వరితముగా నయోధ్యకుఁ బోయి కౌశిక ప్రతిశుశ్రితంబును
సంపూర్ణ పఱిచి దక్షిణోపార్జనంబునకయి వారణాసి కేగెదను.

(ప్రకాశముగా) మహానుభావ! తమ రిప్పుడయోధ్యకు విజయం
చేసి నన్నుఁ గృతకృత్యునిం గావించి దక్షిణాసంపాదనంబున కను
మతి యిచ్చి యంపవలయు.

విశ్వా—(ఆశ్చర్యముతోఁ దనలో) అహో! ఈ దురాత్ముని మనస్థై
ర్యము! ఏమీ! వీనిమహానుభావత్వము! ఆ! దురాత్మ
అచిరకాలముననే నీబింకము నేను వీక్షించెదను.

ఉ. ఓరిమదాంధ! యెందనుక నుజ్జ్వలరాజ్యవిభూతికం బలెం
దోరపుసత్యసంపదకుఁ దోడన పాసినవానిఁగాఁగ (గ
న్నార నినుం గనంబడయ నందనుకన్ భవదీయ దుర్నరూ
దారత బగ్గుబగ్గను మదాగ్రహ మాఱదురా దురాత్మకా.

(ప్రకాశముగా) రాజా! అలాగే కానీ. ఏమి దోషము.

(నిష్క్రమించుచున్నారు.)

—o—

శ్రీ పరమాత్మనే నమః

# హరిశ్చంద్ర నాటకము

## తృతీయాంకము

(తరువాతబీభత్సవేషముతోఁబాపపురుషుఁడుప్రవేశించుచున్నాఁడు)

పాప—(వికటముగా నడుచుచుఁ బెద్దనవ్వునవ్వి తనలో)

క. ఆరంభమధురుఁడ నతి
ఘోరవియోగాధిశుగ్రజామధ్యుఁడ నా
నారూపనరక బాధా
దారుణపరిణుమఁడను గదా పాపుండన్.

(ముందు చూచి భయపడి తొలఁగి) కట్టా! పేరెత్తనయిన వల్లగాని యీవల్లకాటిపట్టణము నాదుంపదెంపినది. నన్నుఁ గడతేర్చినది. ప్రవేశముమాట యటుండఁగాఁ దుట్టతుదకుఁ గన్నెత్తి దీనిఁదేఱి చూడ నయినఁ జాలకున్నాఁడ. అమ్మా! నే నేమిచేయుదు? (ఆలోచించి) కానీ నే నిక్కడ నేకతంబ యుండి జన్మాంతర సంచితుని నన్ను విడిచి యిందుఁ బ్రవేశించిన జనులను దిరిగివచ్చున ప్పుడు వెన్నంటెదను,

(తెరలో)

చ. అవుదల శంభుపాదజలజాంకిత మాయనకంత ప్రేమ మా
శివకును బుత్రివత్సలత, సిద్ధతపం బతనుశ్రుతంబు నా
కివి యిటు లున్నఁ గీల్నరము లెమ్ములుఁ దోలునమూయఁబడ్డ జీ
ర్ణ వపువిదే? మలంఘ్య పరిణామము ప్రాక్కృతకర్మ మేరికిన్.
(సావష్టంభముగా) ఆ! అది యాలాగే గదా! (విస్మయముతో)
ఎవఁడురా యిక్కడ మాటలాడుచున్నాఁడు. (తెరవంకఁజూచి)
ఓహో! భగవానుఁడయిన విషమలోచనునియాసన్నపరిచారకుఁడు భృంగీశ్వరుఁ డిదిగో నీలాగున వచ్చుచున్నాఁడు. నేను త్వరితముగా నవ్వలకుం బోయెదను.

(నిష్క్రమించుచున్నాఁడు.)

(తరువాత భృంగీశ్వరుఁడు ప్రవేశించుచున్నాఁడు.

భృంగీ—(అవుదల శంభుపాదేత్యాది పఠించి యాలోచించి) దీని కన్యథాత్వంబు గలదా? రాజర్షి యయిన హరిశ్చంద్రునకును దశావిపర్యయము ప్రాప్తమయినట్లు దేవర దేవేరికిం దెలియఁబఱిచెను.

ఉ. ఆనతి యిచ్చుచో నధిపునద్భుతమైనచరిత్రఁ, జిల్లై నె
మ్మోనిడు వెంద్రుకల్ పొడమి మేఁగినబూదియ రాలికిం; తదీ
యానన మాచలద్భ్రినయనాంబురుహత్రియమయ్యె; మాళియున్
బూనినపూపరేవెలుఁగుఁబూ వసియాడఁ జలించె మాటికిన్.

ఇప్పు డాచక్రవర్తి యిటకు రాఁగలఁడని దేవీసహితము భగవానుఁడు ఫాలలోచనుఁడు పర్యుత్సుకుఁడయి యున్నవాఁడు. నేనునుశీఘ్రముగా భగవదారాధనము నిర్వర్తించుకొని యావేడుకఁ జూడ సిద్ధముగా నుండెదను. (నిష్క్రమించుచున్నాఁడు)

(తరువాత విచారముతో రాజు ప్రవేశించుచున్నాఁడు.)

ఉ. ప్రీతిని మౌని కిచ్చి పృథివిం దనివిం గనుమానసం బని
ర్యాతితదక్షిణం దలఁచి వ్యాకుల మయ్యెడు; నాకు నార్జనం
బాతనిరాజ్యమందుఁ దగనందునఁ దజ్జలు ధాత్రి నాని దై
పాతకహారియా శివనివాసముఁ జేరుదుఁ గాశి కాపురిన్

(చింతను నటించి నిట్టూర్పువిడిచి) అక్కటా! ఎంతకష్ట మెంతకష్టము!

మ. అవశిష్టంబు త్రయంబు త్యాగమునకీయాలుంగుమాతుండు మే
నవధిన్ లే దిఁకఁ, గ్రోధి గాధుసుతుఁడత్యాజ్యంబునత్యంబు, భూ
రువిజస్వోపహతంబు గాన విడ నైతిం గాదయో! జీవ మే
మి వౌనర్పంగను బాలువోదు మది కేమేలన్ దిశల్ శూన్యముల్

(ముందు చూచి సంతోషముతో) ఓహోహో! ఇదిగో వారణాసి.
తల్లీ! వారణాసి! నమస్కరించుచున్నాను. (ఆలోచించి యాశ్చ
ర్యముతో)

చ. తపముల బ్రహ్మచర్యముల దాంతిశమానశనవ్రతంబులన్
క్షపితతముల్ వరిఁతు రెది సన్యసనంబుల బ్రహ్మనిష్ఠు ల
ట్టిపరమ తారకంబు శివుఁడే యుపదేశ మొసంగుఁ బ్రాణికిన్
వపువుఁ దొరంగుచో నిటఁ బునర్జననం బిఁక లేక యుండఁగన్.

చ. సడలనిచావు పుట్టువుల సంకెల యూడును బ్రాణికిచ్చటన్;
మృడునికరంబునుండి పడియెన్ మును బ్రహ్మశిరంబు నీట; ని
య్యెడ నవిముక్తుఁడై యభవుఁడేనముఁ బాసి వసించు జాయతో;
విడువఁడు దీని నెప్పుడును; వే ఱొక టింతటిక్షేత్ర మున్నదే?
నేనిం దేయుపాయంబున మునిఋణంబునకుఁ బాయఁగలవాఁడ.
(విచారముతో)

మ. ధనదుం గెల్చి గ్రహింతునో ధనము శ్రీత్యక్తంబు నా కేల గె
ల్వను వౌ యాచన జన్నిగట్ల కది చేయర్ దీనతన్ క్షత్రియుల్
ధనమూలంబు బెహార మున్న దది పేదన్ సాగునే నాకు? నే
పనికిం గాల ముపేక్షణీయ మది యోర్వన్ దైవయోగంబునన్

అయ్యో! మందభాగ్యుఁడను నే నేమి చేయుదును? [ఆలోచించి సంతోషముతో) ఓహోహో! దొడ్డయుపాయము తోఁచినది. నే నిప్పుడు.

క. అమ్ముకొని నన్ను నే స
త్యమ్మును బాలింతు శాశ్వతమ్ముగ; నదుపా
యమ్మన నది ప్రోవ మిని
కమ్ముగ లోకద్వయమ్ము గావమి గాదే?

[సావష్టంభముగా] కుట్టువాఁడు లోహితాస్యుఁడు వెనుకఁజిక్కఁగా వానికొఱకుఁ బ్రతీక్షించుచు దీర్ఘాధ్వవిశ్రాంత యగుదేవి నన్నా రా నింకను గలసికొనలేదు. ఆమెరాకమున్నె నేను సత్వరముగాఁ బోయి నాకోరిక తీర్చుకొనియెదను. [పైకిఁ జూచి) అబ్బో! అప్పుడే ప్రొద్దు నెత్తిమీఁదికి వచ్చినదే.

ఉ. చండకరుండు కౌశికునిచందమునం దపియించుఁ దీవ్రమై;
మండెడుఁ దెర్వు నామనసుమాదిరి; దైవవశంబునం గటా,
యెండను మాఁడిమాఁడి కృశియించినదేవియుఁ బోలె భూమిరు
ట్షండము క్రిందకిం జనియె ఛాయయు నీయెడ మెల్లమెల్లగన్—

కాఁబట్టి యిప్పుడు గడువునకు — గాదుకాదు—హరిశ్చంద్రునకె, యవసాన మాసన్నమైనది. హా! మంద భాగ్యుఁడను నేను నశించితినిగదా! [భూమిమీదఁ బడి తిరిగి లేచి దుఃఖముతో] ఓరి దురాత్మా! హరిశ్చంద్రహతక!

తే. గీ. మున్నుగా బ్రాహ్మణున కియ్యకొన్నయట్టి
దక్షిణను నీక బ్రహ్మస్వదగ్ధుఁడవును

సత్యచలితుండ వగుచు నేచాయ కీవు
సురఁగువాఁడవురా యోరిపరమశఠుఁడ?

నే నిప్పు డంగడివీథికిం బోయి ప్రకృతమనుసరించెదను. ఇంతకు నమ్మహాముని వచ్చి యుండనోవును. [త్వరితముగా నడచి యేకాంతమున నున్నాఁడు]

[తరువాతఁ గోపముతో విశ్వామిత్రుఁడు ప్రవేశించుచున్నాఁడు]

విశ్వా—[తనలో]

చ. కరగత లైన విద్యలవిఘాతము చేతఁ బ్రవృద్ధమై మదీ
యరుష, శఠుండువానివినయాన్వితవృత్తి నిరుద్ధమాయెను, లో
దరికొను నెండుఁగట్టియలఁ దద్దయు మండుదవంబు, పై పయిం
గురిసెడువానలం దడియుకోనను బోలె నను దహించెడున్,

[కోపముతో] దురాత్మా ! హరిశ్చంద్రహతక !

ఉ. ఓరిమదాంధ ! యెందనుక నుజ్జ్వలరాజ్యవిభూతికిం బలెం
దోరపు నత్యస పదకుఁ దోడన పాసినవానిఁ గాఁగఁ గ
న్నార నినుం గనం బడయ, నందనకన్ భవదీయదుర్న యో
దారత బగ్గుబగ్గను మదాగ్రహ మూఱదురా దురాత్మకా.

(చూచి విస్మయముతో) ఏమీ ! యిదిగో దురాత్ముఁడు—పోనీ మహాత్ముఁడే—వీఁడు వచ్చినాఁడే. సమీపించెదను.

[అట్లుచేసి క్రోధముతోఁ బ్రకాశముగా] ఆవురా ! యేమిది! మాద క్షిణాసువర్ణము లిప్పటికి నీయ కున్నాఁడవు.

రాజు—[సంభ్రమముతో] ఓహో ! భగవానుఁడు కౌశికుఁడే, స్వామీ! యభివాదనము జేయుచున్నాఁడను.

విశ్వా—ఛీ ! యనార్య ! నీ విప్పుడును మమ్ము శుష్కప్రియములతో వంచింప నెంచుచున్నావురా?

రాజు—(చెవులు మూసికొని) స్వామీ! శాంతింపుఁడు శాంతింపుఁడు.

విశ్వా—(క్రోధము నభినయించుచు) ఛీఛీ! దురాత్మ! అలీకదాన సంభావనాప్రఖ్యాపితమిథ్యాపౌరుషప్రపంచ! ఉండుండు.

చ. నెలయును నిండినం గడువు నీ విడ వింకను మాదుదక్షిణన్
వలవనిశుష్కపున్మధురవాక్కులతో నిటు డాయ చుందు వో
పలువ! ప్రతిశ్రుతం బయిన పైకము నీయమి నల్గి యిచ్చుమ
జ్జ్వలితకృశానుఘోరతరశాపము నీపయి నిప్పుడే పడున్.

(శాపజలమును గ్రహించుచున్నాఁడు)

రాజు—(సంభ్రమముతోఁ బాదములమీఁదబడి) స్వామీ! శాంతింపుఁడు శాంతింపుఁడు.

క. తాపసవర! మీదక్షిణఁ
జాపింపర యేని ప్రొద్దు వడకుండంగన్
శాపార్హుఁడో యీమనుజుఁడు
వ్యాపాదార్హుండొ మీకు స్వాధీనుఁడటన్.

కావునఁ బ్రసన్నుల రయి వణిగ్వీథిం బోవుదము రండు.

విశ్వా—(శాపజల ముపసంహరించి) కానీ, అక్కడకే పోయియిమ్ము. ఇంతలో నేనును ద్వితీయస్నానము నిర్వర్తించుకొని వచ్చెదను.

(నిష్క్రమించుచున్నాఁడు.)

రాజు—(నిర్వేదించుచుఁ దనలో)

క. పరిణామదారుణం బిహ
పరభయకారణము ఋణము ప్రాణుల కిస్సీ
పరికుపితధనికముఖముం
దరిసింపనిసరుఁ డొకండె ధన్యుఁడు పుడమిన్.

(నడచి సంతోషముతో) ఓహో! యిదిగో! వణిగ్వీథి (శిరమునఁ దృణ ముంచుకొని ధైర్యముతో) ఓహో! సాధులారా!

క. ఒదవి యొకానొకయక్కఱ
యది దీఱుచునట్టి వేఱుపాయము లేకే
నిదె లక్ష హేమములకుం
గొదుకక యీదేహ మమ్ముకొనుచున్నాఁడన్.

ఆర్యులారా! కొనుండి నన్నుఁ గొనుండి. (ఆకాశమున)ఏమనియె దరు? ఎందుకీ దారుణకర్మము నారంభించితి వందురా? నన్నిట్లు మీరేల నిర్బంధించెదరు? ఈజీవలోక మతివిచిత్రము గదా! (వేఱొకచోటికేగి "ఒదవియొకానొక" అనుపద్యమును చదివి యాకాశమున) ఏమనియెదరు? "నీశక్తియేమి? పని యేమి? జ్ఞాన మేమి? యని యడుగుచున్నారా? (చిఱునవ్వుతో)

క. దేవర యేపని వెట్టినఁ
గావించెడువాఁడ నౌను గా దనక మదిన్
సేవకునకు దొరయానతి
యావంతయు మీఱమియకదా సుగుణ మగున్.

(ఆలకించి)ఏ మనుచున్నారు? నీవు వెల యెక్కుడుగాఁ జెప్పినాఁడవు కాఁబట్టి మఱి యొకబేరము చెప్పుమందురా? (ఖేదముతో) ఓ సాధులార! మేము క్షత్రియులము. మరలమరల బేరములుచెప్పు ట యెఱుంగము. మీరు వెడలిపొండు. (వేఱొకచోటికేగి "ఒదవియొకానొక" అను పద్యమును చదువుచున్నాఁడు.)

(తెరలో) ఆర్యపుత్ర! ఆత్మంభరుండవు గాకుము. అట్లునీతో సుఖం బునంబాలిదాననై నన్ను మందభాగినింజేసి నేఁడు సంవిభాగప రాఙ్ముఖుండ వగుట పాడిగాదు. నాథా! ప్రసన్నుండ వయి నన్నే యీకార్యమునకు నియోగింపుము— నీ ప్రణయ మిప్పుడు సఫలమ నెప్పటిదేగదా!

రాజు—(వైలక్ష్యముతో) అయ్యో! దేవి వచ్చినదే, నాకోరిక నెఱవేఱినది కాదు.

(తరువాత బాలకానుగమ్యమాన యయి వైక్లబ్యము నటించుచు శైబ్య ప్రవేశించుచున్నది)

శైబ్య—(సకరుణముగానార్యపుత్రేత్యాది పఠించుచు మెల్లగానడచి) ఆర్యులారా! నమయదాసినిగా నన్నుందలిసగము వెలకు విలుచుకొనుఁడు.

బాలకుఁడు—ఆర్యులారా! నన్నుఁ గూడ విలుచుకొనుఁడు.

రాజు—(వేఁడినిట్టూర్పు పుచ్చి తనలో) అన్నా! యెంతకష్ట మెంత కష్టము!

మ. చతురంభోధిపరీతభూతలమహాసామ్రాజ్యముఙ్ వీడితిఙ్;
హితులం బాసితి నశ్రుదీనముఖులఙ్; నూఱడింపం బ్రజఙ్;
సతి పుత్రుండిపుడమ్ముకోఁదమునిటుల్సైదింరిచూతుంగటా!
శతధా వ్రయ్యదు గుండె, ధాతయిది వజ్రానిఙ్ వినిర్మించెనో

శైబ్య—(బయ లాలకించి) ఆర్యులారా! యే మనెదరు? నమయు మేమనియా? పరపురుషపర్యుపాసనంబును, బరోచ్ఛిష్టభోజనంబును బరిహరించి మఱి యేకార్యమైనను జేయుదానను. అదియే నాదునమయము. (మరలఁ జెవి యొగ్గి) ఏమనియెదరు? ఈ నమయమున కొడంబడి నిన్నెవఁడు కొనునందురా? అట్లయినచో మీరనుగ్రహించి వెడలిపొండు. ఈజనముతో మీకేమిప్రయోజనము? ఎవ్వఁ డేని దీనజనానుకంపి యగుభూసిలింపుఁడు సాధుశిఖామణి నన్నుఁ గొనంగలఁడు.

(తరువాతనుపాధ్యాయుఁడును వటుఁడును బ్రవేశించుచున్నారు.)

ఉపా—వత్స! కౌండిన్య! నిజముగా నంగడివీధిని విక్రయింపఁ బడుచున్నదా?

వటు—గురువుగారితోనే నసత్యము మనవిచేయుదునా ?

ఉపా—అట్లయిన నక్కడకే పోవుదము.

వటు—చిత్తము. గురువరా ! ఇటువిచ్చేయుఁ డిటువిచ్చేయుఁడు.

ఉపా—(నడచి చూచి యాశ్చర్యముతో)ఓహో! యంగడివీథి యెంతరమణీయముగా నున్నది!

మ. పసిఁడిక్ మేరుమహాద్రిమున్ మణులచేఁబాథోధివేలక్, నవా
బ్దసమానోన్మదసామజచ్ఛటల వింధ్యశ్రీ, విడంబించుచున్,
వసనోర్విల్ల యాచుఁ గల్పలతశేవక్ బ్రార్థితార్థంబు ల
ర్థిసమూహంబున కిచ్చువిపణి బుద్ధిన్ లోపమున్ జేయదే.

వటు—స్వామీ ! గురువర్య ! అదిగో నక్కడ గుంపుగా నెందఱో జనులు గనఁబడుచున్నారే అచ్చోట నది తప్పక యుండునని నే నూహించుచున్నాను. (సమీపించి) అయ్యలారా! దారిదారి. ఓసరిల్లుఁడోసరిల్లుఁడు.

ఉపా—ఓహో? యేమి యీసమ్మర్దము!

శైబ్య—(వైక్లబ్యముతో)ఆర్యులారా! సమయదాసినిగా నన్నందఱి సగము వెలకు విలుచుకొనుఁడు. (మరల ననుచున్నది)

బాల—ఆర్యులారా! నన్నును నన్నును

ఉపా—(చూచియాశ్చర్యముతోఁ దనలో)ఏమీ! యీమెయేగాదా? (ప్రకాశముగా) అమ్మా! యేమి నీసమయము?

శైబ్య—బ్రాహ్మణోత్తమ! పరపురుష పర్యుపాసనంబును, బరోచ్ఛిష్టభోజనంబును బరిహరించి మఱియేకార్య మయినను జేయుదా నను.

బాల—సాధుబ్రాహ్మణా! నన్నును నన్నును.

ఉపా—(హర్షముతో) నీసమయ మిది యనుకూలముగానున్నది. ఈ

నియమము తోడనే నీవు మాయింట నివసింపుము. నాభార్య యగ్నిపరిచర్యాపరాధీనత్వమున గృహకృత్యనిర్వాహణము నకుం జాల కున్నది. ఇదిగో; ధనంబుఁ బుచ్చుకొనుము.

శైబ్య—(సంతోషముతో) చిత్తము. భూసురోత్తమ! నే ననుగ్రహింపఁబడినదానను.

ఉపా—(తడవుగఁ దేఱిపాఱఁజూచి విస్మయముతోఁ దనలో)

ఉ. మేలిమిసుంగు మూర్ధమున, మేకొనుసాజపుసిగ్గు మోమునన్
గాళులవేళ్ళఁజూపుగుఱిఁ నవ్వుల మంథరభావ ముక్తులన్
జాలఁగఁ గోమలత్వమును జారిమమున్ మితభావ మిన్నియుం
జోలిచి చూడ నీమెఱుఁగుఁబోఁడి కులీనగ నాకుఁదోఁచెడున్.

(విచారముతోఁదనలో) ఇట్టి యాకృతివిశేషమున కింతటిదురవస్థ రావలసినది కాదు. ఏమికారణమున నీమెకీదుర్దశ ప్రాప్తించినది చెపుమా?(ప్రకాశముగా)బోటీ! నీపెనిమిటి బ్రతికియున్నాఁడా?

శైబ్య—(తలతో సంజ్ఞచేయుచున్నది.)

రాజు—నిటూర్పు విడిచి తనలో హా! యేమిబ్రతుకు! బ్రతికియున్న వానిభార్యకా యిట్టి యవస్థాంతరము?

ఉపా—ఇప్పు డతఁడు నీదగ్గఱ నున్నాఁడా?

శైబ్య—(కన్నీళ్ళతో రాజును జూచుచున్నది.)

ఉపా—(చూచి విస్మయముతో) ఇతఁ డీమెభర్తయా? (తడవుగఁ దేఱి చూచి ఖేదముతోఁ దనలో)

శా. మూఁపుల్ గోపతిమూఁపురంబులు,భుజంబుల్ మత్తవేదండశుం
డాపీనాయతముల్, విశాల మురమున్, హా! లోకరక్షార్హ మీ
రూపం బేమి? కిరీటయోగ్యశిర మారోహించు టేమీ తృణం
బాపాదింపఁడు వేని కెసెరగు వామారంభుఁడౌ ధాత తాన్?

(సమీపించి కన్నీళ్ళతోఁ బ్రకాశముగా) ఓయి మహాత్మ! నీవు స్వదుఃఖమున నన్నుం బాలివానిఁగాఁ జేసికోఁ దగును. నీయీప్రయత్న మెందునిమిత్తమో నాకుఁ దెలియబఱుపుము.

రాజు—(ఆలోచించి వైక్లబ్యముతోఁ దనలో) ఈసాధుజనునివచన మన్యథాకరించుట యుక్తముగాదు. (ప్రకాశముగా) సాధువర్యా! విస్తరించి చెప్పుటకు దేశకాలము లనుకూలములు గావు. సంక్షేపించి వినిపించెదఁ జిత్తగింపుము. బ్రహ్మస్వపీడితుండ నయి నే నీప్రయత్నముఁ జేయుచున్నాను. ఇంక నన్నేమియుఁ జెప్పుమని నిర్బంధింపకుము.

ఉపా—అయ్యా! అట్లయిన నీకుఁ గావలసిన ధనము నేనిచ్చెదఁ బ్రతిగ్రహింపుము.

రాజు—(చెవులు మూసికొని) ఓహో సాధువర్య! నీ వన్నది ప్రథమవర్ణ వృత్తి. మాబోఁటులకది నిషిద్ధముగదా! నీవు నన్నుఁ గనికరించితి వేని దానిని మూల్యసంబంధమున ననుగ్రహింపుము.

శైబ్య—(తొందరగా సమీపించి వినయముతో నంజలిపట్టి) ఆర్య! ఆర్య! ముందుగ బేర మాడిన నన్ను నిరాకరించుట నీకుఁ దగదు నేను నీపాలఁ బడితిని. న న్ననుగ్రహింపుము.

ఉపా—(కన్నీళ్ళతో) ఓ సౌభాగ్యవతీ!

ఆ. వె. ఏను దెచ్చి యున్న హేమంబు లరలక్ష,
యీధనంబు మీకు నిద్దఱకును;
యుక్తమెట్టు లట్టు లొనరింపఁగాఁ దగు
నరసికొని పరస్పరానుమతిని.

(సొమ్మునిచ్చుచున్నాఁడు.)

శైబ్య—[పుచ్చుకొని సంతోషముతో] అదృష్టవశమున నార్యపుత్రు

నిప్రతిజ్ఞాభర మరపాలు తగ్గినది. నే నిప్పుడు కృతార్థురాల నయితిని.

ఉపా—[తనలో ఇప్పు డీదంపతుల దుఃఖము నేను జూచి సహింపఁ జాలను. [వెళ్ళఁబోవుచున్నాఁడు.]

శైబ్య—బ్రాహ్మణోత్తమా! ముహూర్తమాత్రమండుము. ఆర్య పుత్రిని మో మొక్కమాఱు కన్నులనిండఁజూచుకొని వచ్చెదను.

ఉపా—ఇదిగో నీకౌండిన్యుఁడుండుసు. [నిష్క్రమించుచున్నాఁడు]

శైబ్య—[రాజుబట్టను సొమ్ముమూట గట్టి] ఆర్యపుత్ర! న న్నీద్విజ వరునికి దాసినసుగా ననుమతింప వేఁడుచున్నాను.

రాజు—[దుఃఖముతో] దేవీ! దైవమే యనుమతించెను. [ఆకాశముఁ జూచుచు నిందారహితముగాఁ దనలో] అయ్యో! హతవిధీ!

తే. గీ. పట్టమహిషిగఁ జేసిన పరమసాధ్వి
దాసినగఁ బంపు చుంటిని పరునియింటి
కకట! యిది మాళి నున్న మానికముఁదీసి
పాదభూషణ మొనరించుభంగి కాదె?

[మఱియు జాలిగా] హా! యెంతకష్టము.

ఉ. ఆలరిదైవ మాపదల కగ్గము సేయుట మందబుద్ధినై
యాలిని జాలి నీకరణి నంగడికిం గొనితెచ్చి యమ్మఁగాఁ
జాల నిజాన్వయం బపయశంబును బొందె నటన్నకుందునక్
హేళియు నక్రమమూర్తిమలినీకృతవక్త్రుఁడునయ్యెనయ్యయో

[ధైర్యము తెచ్చుకొని ప్రకాశముగా] ప్రియురాలా!

ఉ. సేవ లొనర్పు భక్తిని నశిష్యున కాద్విజవంశమాళికిన్;
నీవు తదియ జాయకును నెమ్మనిజేయు మహోపచారముల్;
పావని! కావునీ మొదలఁ బ్రాణము లేనుఱ కేను మర్వకుఁ;
దైవము శాసనంబు నవతంసము సేయక త్రోయ వచ్చునే?

శైబ్య-ఆర్యపుత్ర! దేవరయాదేశమెట్లు అట్లు నడచుకొనియెదను [వెళ్ళఁబోవుచు రాజును చూచి దుఃఖించుచున్నది]

వటు-రావమ్మా రావమ్మా! ఉపాధ్యాయులు దూరము వెళ్ళినారు.

శైబ్య-[అనునయముతో] నాయనా! ముహూర్తమాత్రము న న్ననుమతింపుము. ఆర్యపుత్రుని మోమొక్కమాఱు కన్నులార జూచి వచ్చెదను.

రాజు-[దుఃఖించుచు] ప్రియురాలా! నీవుదుఃఖము మానుము. బ్రాహ్మణోత్తముఁడున్నాఁడు గదా!

శైబ్య-[రాజును జూచుచు మెల్లగా నడచుచున్నది]

బాల- బాబయ్యగారూ! అమ్మయెక్కడకు వెళ్ళుచున్నది?

రాజు- [ఖేదముతో] నాయనా! యెక్కడ దాసిగావలసి యున్నదో యక్కడకు.

బాల- ఓరీవడుగ! మాయమ్మ నెక్కడకుఁ దీసికొనిపోయెదవురా?

వటు- [కోపముతో] ఛీ! పోరా యావలికి గర్భదాన! [గెంటి క్రిందఁబడఁ ద్రోయుచున్నాఁడు]

బాల-[పెదవి విఱుపుతోఁ దల్లిదండ్రులఁ జూచుచున్నాఁడు]

ఇద్దఱు-[కన్నీళ్ళతో బిడ్డను జూచుచున్నారు.]

రాజు-అయ్యా! బ్రాహ్మణ! శైశవ మనపరాధ్ధముగదా! నీ వీలాగున వానిని ద్రోయవచ్చునా? [పిల్లవానిని లేవనెత్తి శిరము మూర్కొని కౌఁగిలించుకొని దుఃఖముతో]

మ. అదరం గ్రోధవశంబునిం బెదవి, యన్నా! మేలగన్గొందునా
వదనం బేను దయావిహీనుఁడ మహాపాపుండ, నాకన్న శ్వా
పద మైనన్ నలుసంతమే లది దలంపన్ మానినం గూనలన్
గదురం జేయును బెంటిచోట నయినం గాఢానురాగంబెదిన్.

నాయనా! నేను బరమచండాలుఁడను. నన్నేల యనుసరించెదవు?
మీయమ్మతోడం బొమ్ము (దుఃఖించుచున్నాఁడు)

శైబ్య—ఆర్యపుత్ర! అదృష్టహీనురాల నగు నానిమిత్తము దుఃఖపడుచు మహర్షి కార్యము నేమఱియెదరు సుఁడీ. (పిల్లవానిని దీసికొని నడచుచున్నది)

(తరువాత విశ్వామిత్రుఁడు ప్రవేశించుచున్నాఁడు.)

విశ్వా—ఆ! ఏమిది! మాదక్షిణాసువర్ణము లిప్పటికిని ముట్టవయ్యేను!

రాజు—(విని సంభ్రమముతో సమీపించి) స్వామీ! ఇప్పుడు సగమిచ్చెదఁ బుచ్చుకొనుఁడు.

విశ్వా—ఛీ, మూర్ఖ! సగమే మొగముతో నిచ్చెద ననువాఁడవురా? నీవు నిజముగా నియ్యఁ దలఁచుకొంటివా, ప్రతిశ్రుతమును నిశ్శేషముగా నిచ్చివేయుము.

(తెరలో)

క. ఏల తపం? బేలవ్రతం?
బేల బహుశ్రుతము గాల్పనే యిన్నియిసీ
యీలీల హరిశ్చంద్రుని
జాలిం బెట్టెదవు నీవు సద్విప్రుఁడవే?

విశ్వా—(విని క్రోధముతో) ఎవండ్రురాపీండ్రు? న న్నిసీయని గర్హించుచున్నారు. (పైకిఁజూచి) అహో! ఎమీ! విమానచారులు విశ్వేదేవులా? (కోపమును జూపుచుఁ గమండులుజలంబున వార్చి శాపవారిం గయికొని)
ఛీ! అనాత్మజ్ఞులారా! ఓరీ క్షుద్రక్షత్రియపక్షపాతులారా!

క. కాఁగలదు మీకు జన్మం
బేగురకును క్షత్రయోని; నిది గాకటుపై
నూఁగుంబ్రాయమువారిం
దాఁగెడపును ద్విజుఁడు ద్రోణతనయుఁడు మిమ్మున్.

(మరలఁ బైకిఁ జూచి సంతోషముతో) ఓహోహో? యిదిగో! వీరు—

ఉ. మామకదృష్టిపాతభయమగ్నచలాచలఘంటికారవా
క్రామితనాకసంస్ఖలితరత్నవిమానమునుండి యేవురుక్
భూమిని బిట్టు గూలెదరు, బొమ్మిడికమ్ములు దాలుకో రథ
క్షామములందు; నూడిపడఁగర్ణవిభూషలు, గ్రిందుగాఁ దలల్!

రాజు—(పైకిఁ జూచి తనలో) ఓహోహో! తపఃప్రభావము; హరిశ్చంద్రుఁడు క్లేశమొందుట యుక్తమే గదా! (ప్రకాశముగా) స్వామీ? ఋషివర్య? మీర లన్యథా తలంపకుఁడు.

ఆ. వె. ధర్మపత్ని నమ్మి తనయుని నమ్మి కూ
ర్చినధనమ్ము దీనిఁ జేకొనుండు
మిగతసొమ్ము గూడ మిగతిలోనఁ జేర్ప న
న్నంత్యజునకు నైన నమ్ముకొందు.

విశ్వా—(క్రోధముతో) ఆ! కొంత యెందుకు? అంతయు నిచ్చివేయుము.

రాజు—ఓసాధులారా?

"క. ఒదవి యొకానొక యక్కఱ
యది దీఱుచు నట్టివేఱుపాయము లే కే
నిదె లక్షహేమములకుం
గొదుకక యీదేహ మమ్ముకొనుచున్నాఁడన్."

(అనుపద్యము మరలఁ జదువుచున్నాఁడు.)

(తరువాతఁ జండాలవేషముతో సానుచరుండు ధర్ముఁడు ప్రవేశించు న్నాఁడు.)

ధర్మ—(తనలో)

చ. భువనములం దిరంబుగను బ్రోచెడువాఁడును నేను; నన్నుఁ ద
ద్భువనయుతంబుగా నెపుడుఁ బ్రోచెడు నట్టిది సత్యమందుచేఁ
గువలయనాథుసత్యమును గొండొకశోధనముం బొనర్ప ని
చ్చవొడమి గాదె యీయధమజాతి పరిగ్రహణం బొనర్చితిన్.

(తడవుగ నాలోచించి యాశ్చర్యముతో) ఆహా! నేను నాదివ్యదృష్టి నెంత వెదకినను రాజర్షి యగు హరిశ్చంద్రునికి సమానుఁడుగానబడ కున్నాఁడు! కానీ నే నతని యొద్దకే పోయెదను. (నడచి ప్రకాశముగా) ఓరీ వేపిగాఁడ ; వరాలజాలెము తీసికొని వచ్చినాఁడ వట్రా.

అనుచరుడు—ఓరి పెద్దా ? నీ కిప్పుడు వరాలజాలె మెందుకురా.కల్లుగాని తాగెదవట్రా ?

ధర్మ—అరే ; నీ కెందుకురా నాతాగుడుజోలి ?

రాజు—(ఒక ఒదవి యొకానొక యక్కఱ" అను పద్యమును "ఆ,వె.ఏను దెచ్చియున్న హేమంబు లతలక్ష" తృ-అం22వపద్యమును జదివి, యంతటఁ జూచి ఖేదముతో)

అయ్యో? నే నెంతమందభాగ్యుడను ? నన్నుఁ గొనుటకు నెవ్వరును జేర కున్నారు? హా? చచ్చితిఁ గదా? (మూర్ఛిల్లిపడుచున్నాఁడు)

ధర్మ—(విని చూచి తనలో) ఏ మిది? యీమహాసత్వుఁడు మూర్ఛిల్లినాఁడు? కానీ. ఇట్లుచేసెదను.(సంభ్రమముతో సమీపించి ప్రకాశముగా)ఓరీ! లేరా. నేనే నిన్ను కొనువాఁడను. ఇదిగో నీకుఁ గావలసినసొమ్ము పుచ్చుకోరా.

రాజు—(హర్షముతో లేచి) ఓ సాధూ? ఇటు తీసికొని రా.(చూచి విషాదముతో) భద్ర? నీవే నన్నుం గొనియెదవా?

ధర్మ—ఆ? నేను నిన్నుఁ గొనియెదను.

రాజు—అలాగైన నీ వెవ్వఁడవో చెప్పు.

ధర్మ—తే. గీ ఒలికిమిట్టల కన్నింటి కొడయఁడనుర;
నమ్మకపువాఁడర తలార్ల నాయఁకులకుఁ;
తలలు నఱికెడుమనికి పెత్తనము నాది;
పెద్దమాలను వినురోరి పేరుపడితి.

రాజు—(తొందరగాఁ దొలఁగి కౌశికునిపాదములమీఁదఁ బడి] భగవానుఁడా? అనుగ్రహింపుము.

క. మునినాయక నీకే నే
వనముం బొనరించి ఋణముఁ బొసెద నకటా!
వినినది కనినది గా దీ
చెనంటిచండాలపాదసేవ మహాత్మా.

విశ్వా—చీ? మూర్ఖ? తపస్వులు స్వయండాసులు గారా? నీవు దాసుఁడ వయి మాకేమి చేసెదవు?

రాజు—[అనునయముతో] స్వామీ! తమయాజ్ఞచొప్పున నే ప్రవర్తించెదను.

విశ్వా—వినుండు వినుండు విశ్వేదేవులు. [హరిశ్చంద్రునితో] నే నాజ్ఞాపించినట్లు నీవు చేసెదవా?

రాజు—తప్పక చేసెదను స్వామీ.

విశ్వా—అలాగైనపక్షమున నీవు వీనికే యమ్ముడు వోయి తక్షణము మాదక్షిణాసువర్ణము లిచ్చి వేయుము.

రాజు—[చింతతోఁ దనలో] అయ్యో! యేమి చేయుదును? [ప్రకా

శముగా] స్వామీ! చిత్తము. [చండాలుని సమీపించి] ఓ పెద్ద మాల ? నీవు రూఢిగా నన్నుఁ గొనెడుపక్షమున నొక్కసమయ మును మాత్రము చేయవలయును.

ధర్మ—సరే. ఏమి సమ్మయ?

రాజు—విను.

ఆ. వె. తిరిప మెత్తి తినుచుఁ దెరువుఁబేలికలను
గట్టుకొనుచు నెడము గలుగ నుండి
సామి ముదలవెట్టు సకలకార్యములను
గొంకులేక సలిపి కొలుచువాఁడ.

ధర్మ—మంచిది. నే నీసమ్మేకు నొప్పుకొన్నాను. సొన్నా లెత్తుకో. [సొమ్ముకుమ్మరించి దూరముగాఁ దొలఁగుచున్నాఁడు]

రాజు—[పుచ్చుకొని సంతోషముతో]

క. మునిచేతఁ దిట్టువడ క
ష్టను దీఱిచి సత్యవాక్యమునకుం బెడఁబా
యనివాఁడ నయిననాకీ
ననియమచండాలసేవ శ్లాఘ్యము గాదే.

[విశ్వామిత్రునిఁ గూర్చి సానునయముగా]స్వామీ? కౌశికమునీంద్ర మీ రీధన మశేషము ప్రతిగ్రహింపుఁడు.

విశ్వా—ఇచ్చెదవా ?

రాజు—పుచ్చుకొండి స్వామీ ?

విశ్వా—[పుచ్చుకొని తనలో] ఇంక నిర్బంధ మెందుకు ? కానీ పో. యెదను. [సిగ్గుతో నట్లు చేయుచున్నాఁడు.]

రాజు—[వినయముతో దోసిలి పట్టిస్వామీ] ? కాలవిలంబనము చేఁ గావించిన నాయపరాధమును క్షమింపుఁడని వేఁడుకొనుచున్నాను.

విశ్వా—క్షమించితిని. [నిష్క్రమించుచున్నాఁడు.]

రాజు—[చండాలునిఁజేరి] ఓ పెద్దమాల! [అని యర్ధోక్తిని నోరుమూసికొని] ఏలికా! సేవకునకుఁ జేయవలసినపని యాజ్ఞాపింపుము.

ధర్మ—[సంతోషముతోఁ దనలో] ఆ! నీ వీవఱకు, గననిదియు విననిదియు నైనపని నీ కాజ్ఞాపించెద నుండు. [ప్రకాశముగా] ఓరీ? నీవు దక్కినపుఁగాటికింబోయి యక్కడఁ బీనుంగులమీఁదిగుడ్డలను దీయుచు రేయుం బవలు మేలుకోవలసినది. ఇదిగో నే నింటికిఁ బోవుచున్నాను.

రాజు—దేవర చిత్తము [అందఱు నిష్క్రమించుచున్నారు.]

—o—

శ్రీ పరమాత్మనే నమః

# హరిశ్చంద్ర నాటకము

## చతుర్థాంకము

(తరువాతఁ జండాలు రిద్దఱు వెంబడింపఁగా విచారముతో రాజు ప్రవేశించుచున్నాఁడు.)

చండా—ఓనరిల్లుండి బాబులారా? ఓనరిల్లుండి. మీ రంద రిక్కడ నేమి సూడ మూఁగినారు. వీనిని మేము తల గొట్టుటకుఁ దీసికొని పోము. (బయలాలకించి) బాబు లేమనుచున్నారు? వీఁడెవ్వఁడు? ఎక్కడకుఁ గొనిపోయెద రందురా? వినుండి బాబులార! ఈని ఱపేద మాపబువయిన పెద్దమాలవద్ద నొద్దెసొమ్ము పుచ్చుకొని బానిసతనమునకుఁ గుదిరినాడు. అందుచేత వీని నిప్పుడు దక్కిన పుటాలికిమిట్టకుఁ గావలి వెట్ట నెట్టుకొని పోవుచున్నాము.

రాజు- (నిట్టూర్పు పుచ్చి తనలో) అన్నన్నా! ఎంతకష్టము! ఉత్తరోత్తరదారుణం బగుమద్వ్యసనపరంపరాపాతమునకు మేర లేకున్నది!

ఆ. వె. శ్వపచునొద్ద నాకు బానిసం బిప్పుడు.
వసతి ఘోర మైన వల్లకాడు,
పని శవాల మీఁదిపాఁతలు గొనుట, హా!
విధి క్షమింపఁ డిట్టివేతల నైన.

(శోకముతో)ఒక్కదుఃఖము పెక్కుదుఃఖములచేఁ జిక్కఁబడు నందు

రిది నిక్కమే గదా! దక్షిణాదృణ్యానిర్వృతునిన న్నిప్పుడెన్నిదుఃఖ
ములు చుట్టుకొన్నవి.

[దుఃఖము నటించుచు]

సీ. నేనె చుట్టమ నౌటచే నివ్వడనద లా
ప్రజలఁగూర్చి విచారపడుదు నొక్క
యధికవాత్సల్యంపునిధు లైనయాత్మబం
ధువులఁగూరిచి యలందురుదు నొక్క
డెన మాలి మిక్కలి దీనభావము గాంచు
సేవకాళిగుఱించి చింతలుదునొ
పాఱునింటను దాసిపనులు సల్పెడుప్రాణ
వల్లభగుఱియించి వందురుదునొ
యకట! నిను వైనముద్దుఁగుఱ్ఱకు వగతునొ
యధమచండాలదాసత కలమరుదునొ
యన్నిదుఃఖంబులకు మూలమైననాదు.
పాపజీవితమున కార్తిపా లగుదునొ.

[స్మృతి నభినయించు ఖేదముతో.]

మ. ప్రకటాత్యుగ్రతపోనిధానుఁడు దురారాధ్యుండు నాగాధిపు
త్రకున ప్పీఁగెడునాఁ డటుల్ వటుఁడు పోరా గర్భదాసా యటం
చకటా! త్రోసినఁ డెళ్ళి యేడ్చుసుతునాన్యం బేను గన్గొంటిఁ బె
ద్దకఠోరవ్రణమట్లు సల్పెడుఁ దదంతశ్శల్య మెల్లప్పుడున్.

చండా-ఓనతిల్లుండి యిత్యాది మరల ననుచున్నారు.

రాజు-[ఆలోచించి ఖేదముతోఁ దనలో] ఇప్పుడు నన్నిది యెం
త వేధించుచున్నది!

చ. పద మని యొక్కవంక గురుభక్తిని శిష్యుఁడు వేగిరింపఁగాఁ
బదహతిఁ ద్రెళ్ళి యొక్కడను బాలకుడేఁడ్చుచుఁ గొంగులాగఁగా
నదిమినకొద్ది; బెల్లుబుకునశ్రులు దారల గప్పఁగూరునన్
వదలనిబేదచూపు, బలవంతము కాంత మరల్చె నెట్టకేన్.

[వైక్లబ్యముతో] హా! దేవి!

ఆ. వె. తరణిగోత్రమునకుఁ దగినకోడల వైన
నదమలేందువంశజాత వైన
నాతి! భూతిరాశి నేతిమాహుతి వడ్డ
లీల నేల నాకు నాల వైతి?

అయ్యో! రాజపుత్రి!

ఉ. పూవులతోఁటలోఁపలను బూచినక్రొవ్విరవాజులం గటా!
నేవళముల్ రచించుచును నీవు గడున్ మిసిమింతురాల వౌ
దేవగ నాచరింతొ యిపు డెప్పుడుఁ జేసి యెఱుంగనట్టిదుః
ఖావహదాసికాసముదమార్జ్వాకఠోరనికృష్టకర్మముల్.

చండా—అరే! దక్కసపుమసనమిక్కడ దగ్గఱనే యున్నది. దబ్బు దబ్బున రారా.

రాజు—[చూచి ధీరముగా] ఓహో! మహాశ్మశానమా యిది!

ఉ, మండలసంచయంబు పలుమా ఱొనరించి దివిన్ విదూరమం
దుండి యుదంచితాగ్రముల నొప్పెడుతోఁకల నిశ్చలంబు తా
చుండు వెడందపక్షతుల నూఁకున గ్రద్దలు వ్రాలుఁ బీనుఁగుం
గండలయాన నూరుముఖగహ్వరలాలల నిండఁ జందువుల్.

మఱియు నిదిగో!

సీ. బారసాఁచిన చెట్టువలతోడ నిడుపాటి
మెడలను నిక్కించి నడుచునవియు

నిసుఁగుఁబీనుంగుల నెఱిఁగాళ్ళతోఁ ద్రొక్కి
ప్రేవులుముక్కలఁ బెఱుకుననియు
డొక్కలమఱుగుళ్ళముక్కుబంటిగ మెక్కి
ప్రోలప్రాఁకులమీఁదమూఁగునవియు
సీల వట్టినయట్టులెలుఁ గొప్ప నెఱచికై
మొగసితన్నుచుఁ గలహించునవియుఁ
గోర్కు లిగురొత్తఁ బెంటులఁ గూడినవియు
దూఁకుచును గాకిమూఁకలఁ దోలునవియు
నగుచుఁ బితరులసామిబంట్లనఁగ నెందు
గుములుగుములయి రాపులుంగులు చెలంగు.

[తెరలోపలఁ గలకలము] అహో! ఈశ్మశాన మెంత బీభత్సరౌద్ర ముగా నున్నది !

మ. అవె వ్యాపించు నమంగళోగ్రపటహవ్యాడంబరారావముల్
శివ లంతఃప్రతిశబ్దభృచ్ఛ్రుతికటుస్వీయోరుపేట్కార లై ;
తవులం గాటపువెట్ట, పెల్ల శవమూర్ధశ్రేణిమస్తిష్కముల్
స్రవియింపన్, వెలుఁగుంజితాగ్నులివెనిశ్చాంచల్యభుగ్నార్చులన్

[ముందు చూచి సశ్లాఘముగా] ఓహో? ఇట నిది బీభత్సమే యయి నను మిగుల స్పృహణీయముగా నున్నది. ఓశవమా? సర్వస్వగ్రాహులయి ప్రీతినెఱపు శ్వాపదగణంబులచే యథేష్టోపభుజ్యమానం బ వయ్యెదవుఁ నీవెంతధన్యమవు?

చ. కరటము కాళులూని తలఁ, గన్నులమూఁతను విప్పుముక్కుతోఁ
బెరిమను నక్కసృక్వమున ప్రేలెడునాల్కకొనం గ్రసించుఁ గు
ర్కురమున బీఁకు శేఘ మట గొయ్యొనరించును గ్రద్ద బెజ్జమున్;
జరుపు యథేష్టచేష్ట లిటు శ్వాపదముల్ కుణపంబ! నీ యెడన్.

చ. అదె నడు మాయ దే యురము
నయ్యదెమో మవె కన్నులుం బొమల్
గద ? సకలంబు నెత్రు, వన
గండలు, నెమ్ములు, లాల లై యమే
ధ్యదశకు వచ్చె, భీరుభయ
దంబును, బాజ్ఞమహోత్రపాస్పదం
బిది; విషయాభిలాష వెడఁ
గిం దొనరించు వృథాభిమానముల్.

చండా-ఒకఁడు- [ముందుచూచి] అరే? యీపెద్దమ్రానితొఱ్ఱిలో నున్న యమ్మవారికిఁ జండికమ్మకుఁ జాగిలఁబడు రా.

మఱియొకఁడు -అట్లే చేయుదము రా.

ఇద్దఱు- [చాఁగిల్లి]

తే. గీ. చండుతల నుగ్గునూచంబు సలిపినమ్మ
మన్న రాకాసిపోటులు దిన్నతల్లి
కయిని ముమ్మొనవాలు, మైగవురుఁదోలు
జా నలరుకొమ్మమమ్మలు చండికమ్మ.

రాజు- [అంతటఁ జూచి విస్మయముతో] ఓహో! యేమి! కాత్యాయనిబీభత్సోపచారప్రియత్వము !

మ. మృతగోకాన రకంధరాలులితముల్ వ్రేలాడు నిర్మాల్యసం
గతముల్ కర్ణకఠోరటంకృతిపటుల్ ఘంటల్ ; కృతానూవశో
ణితపంచాంగుళిచిహ్న సంకలితముల్ దేవీతరుస్తంభముల్.
సతతం బెక్కియివేనిసర్గబలికాంక్షల్ ధ్వాంక్షముల్ కూసెడుల్

శ్లో. భగవతి ! చండి ! ప్రేతె
ప్రేతనిమా ప్రియే ! లసత్ప్రేతే
ప్రేతాస్థిరౌద్రరూపే
ప్రేతాశిని ! భైరవి ! నమస్తే

[తెరలోపల గలకలము]

రాజు—[ఆలకించి] అహో! దివసావసానసూచకంబులయి నానా దిగంతములనుండి స్వస్వనీడవర్యుత్సుకతం బయలు వెడలినశకున కులములకలకలమాయిది? [పడమరను జూచి] ఆహా! యెవ్వ నికి గాని దైవపరిపాటి దాటరానిది గదా ?

తే. గీ. అకట ! గగనాంగణప్రదీపకుఁడు తరళ
కాలభుజగఫణామణి, క్షణవిడంబి
తౌర్వసర్వాశివిగ్రహుం డదిగో విధురుఁ
డై యహర్పతి గూలెడు నంబురాశి.

[అంతటఁ జూచి విస్మయముతో]

ఉ. క్రాలెడుసంధ్య వధ్యసతి, రాగమసృక్ఛవి, మందరశ్మియా
హేళిప్రశాంత హేతిచితి, యిర్లురుధూమముడుల్ నరాస్థులుం
బాలసముద్రపున్మిసిమి మానిసిపుఱ్ఱియ గాఁగఁ గాలకా
పాలికలీలకుఁ భువనపాళి పొసంగె నహో శ్మశానమై.

చండా—[చూచి] అరే !—

ఆ. వె. తలలు బునకు పట్టు తలకొట్లఁ బడవాని
యట్టు ప్రొద్దుగ్రుంకుగట్టు సేరఁ
గొంగవాలు లూని గోనంగులట్టులు
చిమ్మచీఁకటులును గ్రమ్ముకొనియె.

రాజు—[అంతటం జూచి ధైర్యముతో] ఆహా!యీశ్మశానభూజంబు లిప్పు డెంతగంభీరభీషణంబు లయి చూపట్టుచున్నవి !

ఉ. కొమ్మలదాఁకఁ బై కెగసిగూబలు గుండ్రలు గొల్వుఁగోటరా
స్యమ్ముల; తెక్కలార్చుకొనుచొదలఁగూయుచు వ్రాలుగృధముల్
రెమ్మలఁ గ్రుళ్ళిత్రేవు డయి వ్రేలుశవమ్ములు గాలుగొట్ట, రా
ద్రమ్మగ నోరవంటలడరన్ సరియందునిగుడ్చు ఫేట్కృతుల్

చండా—ఒకఁడు—[జనాంతికముగా] అరే! యెన్నెన్నో దినుసుల దయ్యాలకీదక్కినపువలికిమిట్టియాటపట్టు, కాఁబట్టి మనమిక్కడ నుండి పెందలాడ దాఁటుదమురా.

మఱియొకఁడు—[జనాంతికముగా] అలాగే చేయుదము రా.

ఇద్దఱు—[ప్రకాశముగా] ఓరీ! పెద్దమాలముదలఁ దలఁ దాల్చి రేయింబగలు నీవేమఱిల్లక యీవల్ల కాడు కాదుక యుండవలయుఁ జుమీ.

రాజు—[సంతోషముతో] మహాప్రసాదము. స్వామి యాన తిచ్చి నట్లే చేసెదను.

[తెరలోపలఁ గలకలము]

చండా—[భయముతో ఓయమ్మో! రేయింటి గొలకొల లప్పుడే యుప్పతిల్లుచున్నవి. అరే! మనము వేళంబయూడనిఁబొడుదమురా.

[నిష్క్రమించుచున్నారు.]

రాజు—[ధైర్యముతో నడచి చూచి] ఓహో! యేమి! యీరాకాసి మూఁకల బీభత్సాకారము!

ఉ. ఇంకినపాడునూతులకు నీడగుకన్నుల, బుఱ్ఱముక్కులన్
వంకరపండ్లఁ, గ్రూరపదంబుల, బీఱనరాలపిక్కలన్,
గొంకరగొగ్గిమేలఁ గుటకోటరనిమ్నతరోదరంబులన్
సంకలితంబులై మెలఁగు సంకులభంగిని గాణపచ్ఛటల్

[సకౌతుకముగాఁ జూచి] ఓహోహో! యీపిశాచనిచయముల క్రీడా కలహకౌశల మేమి సొంపుగా నున్నది!

ఉ. త్రాగెడు నొక్కఁ డొక్కరుకరంబున నెత్తుటికోరలాగి యా
త్రాగెడునోర జాఱురుధిరం బెగనాకు మఱొండు; గాఱి భూ
భాగమునందుఁ బేరినది స్వాద మొనర్చు నొకండు; దావకీ
లాగతిదీర్ఘ రక్తకుటిలం బగు జిహ్వక లొట్టవేయుచున్
[కౌతుకమునఁ జూచి చిఱునవ్వుతో] ఔరా! మోటనాండ్ర పరిహా
సమువలెనీరాకాసులకేళీవిలాసమురసాంతమును బొందుచున్నది!

చ, మృదుమధురాంగచేష్టల రహించెడుసంగమభంగు లేడ? దీ
ర్ఘదశినఘట్టజాగ్నికణకాండము లొండొరు దుంబనంబు లం
త్యదినపతన్మహోల్కలతతద్యుతు లీనుమిథఃకటాక్షముల్
ప్రదళదురోస్థిపంజరరవంబు లివేడ దృఢోపగూహముల్ ?
[ఏవపడుచుఁ జూచి] ఛీ యిది యత్యంతబీభత్సముగానున్నది.

చ. పెనుసొదఁ జుంయిదుం యనెడు
పీనుఁగుఁబుఱ్ఱె నుఁ దీసి సోగయె
మ్మునఁ, బ్రళయానిలస్ఫురిత
ఫూత్కృతి నుష్మాని యూఁది ప్రేత మా
యని తన పెద్దనో రెఱచి,
యూఁకుట మ్రింగి గుటుక్కునం, బొళు
క్కున వెడలంగఁ గ్రక్కెడును
గొంతుకలోనది చుఱ్ఱును ఱ్ఱనన్
[స్మృతినభినయించి] ఓహో? వీనిని జూచెడువేడుక యికఁ జాలును.
నే నేమఱక సామియాదేశమున నుండి శ్మశానమం దంతటఁ బరి
భ్రమించెదను. [తిరిగి చూపు నభినయించి] ఓహో ! యేమీ :
యీనిశీధినిగంభీరభావము!

ఉ. క్రమ్మెను జిమ్మచీఁకటి, జగ మ్మఖిలంబును దిగ్విభాగశూ
న్యమ్మగ, మిఱ్ఱుపల్లముల నంధ్రములు వొ్రటిల, దృష్టిపాతమున్

వమ్మగ. లాంతివర్ణములు నష్టముగా, దితకజ్జలాగమి
త్ర మ్మొకనీలిమంబె పరితస్ఫురితంబుగ నద్వితీయ మై
కానీ బిగ్గఱగాఁ బలుకరించెదను. ఓరీ! యెవ రక్కడ? ఇదిగో! నే
ను గాటికాపరిని. మీకెల్ల రకు నాయకుఁడను. నాయానతి నాల
కింపుఁడు.

క. పడయక నాయాదేశం
బిడకయు మృతకంబలంబు నెవ్వరుగానీ
నడపంగ రాదు మననపుఁ
గడఁ గావింపంగ వలయుకర్జము లెవియున్

వినుండు నేఁడు మొదలుగా—

చ. వలె శిరసావహింప నిది వల్లెయటం చిట నప్రమత్తు లై;
చులుకగ సామిశాసనముఁ జూచుట కేను సహించువాఁడఁ గా
నలజలజాననేంద్రమరుదబ్ధిపతుల్యున కైన నొండుమా
టలు గలవానికిం బ్రతిభటమ్ము మదీ యభుజ మ్మగుం జుమీ.

ఏమిది? ఎవ్వడును మాట లాడఁడు! పోనీ. మఱియొకచోట గేకవే
సెదను. [నడచి] ఓహో! యెవరక్కడ [తెరలో]ఇదిగో నోయి
నేను.

రాజు—[ధైర్యముతో] ఓహో! యేమీయీప్రత్యుక్తి! కానీ మా
టనవ్వడిని బట్టి వెళ్ళి వాఁ డెవ్వఁడో నిపుణముగా నరసెదను.
[నడచి తెరవంకఁ జూచి విస్మయముతో] అహో! యితఁ డె
వఁడు?

తే. గీ. బూదె మైఁ బూసి ఖట్వాంగమును ధరించి.
కాంతములు నుజ్జ్వలంబులుగా నరాస్థి

భూషలు, కపాలపాణి యై పోలుచు; నరక
రంకమాళి సాక్షాద్భూతరాట్టో యితఁడు.

[తరువాతఁ గాపాలిక వేషుఁడు ధర్ముఁడు ప్రవేశించుచున్నాఁడు]

ధర్మ—ఇదిగో నోయి నేను.

క. అడుగక చేకుఱుబికిరము
గుడుచుచు, నింద్రియచయంబు గుదియించి వెనక్
గడచి భవ మనుశ్మశానము
కడు బీభత్స మగునట్టికాటఁ జరింతుక్.

[ఆలోచించి] భగవానుఁడు రుద్రుఁడు మహావ్రతము నాచరించెనన్న నది యాయనకుఁ బోలును. కామచారుల కిది యత్యంతము ప్రకర్షము గదా! అయినను—

క. విమలతపోద్వైతము సుల
భము, భైక్ష్యాద్వైతము సులభంబు, క్రియాద్వై
తము సులభం బాత్మాద్వై
తము మాత్రము దుర్లభంబు తల పోయంగక్,

[అంతటఁ జూచి సాశంకముగాఁ దనలో]

"చ. భువనములం దిరంబుగను బ్రోచెడువాఁడను నేను, నన్నుఁ ద
ద్భవనయుతంబుగా నెపుడుఁ బ్రోచెడునట్టిది సత్య మందుచేఁ
గువలయనాథుసత్యమును గొండొక శోధనముం బొనర్ప ని
చ్చ వొడమితయీనికృష్టతమజాతిపరిగ్రహణం బొనర్చితి."

[ఆలోచించి యాశ్చర్యముతోఁ దనలో] ఔరా! యెంత లేసిదుఃఖములు సంప్రాప్తములగుచున్నను వగ పన్నదిగానిరాని యీరాజర్షి చరిత్ర మాశ్చర్యజనక మగుచున్నది. మహాత్ముల కిది ప్రకృతి యే గదా!

చ. అరయఁగ దుఃఖ మంచు సుఖమంచును నేర్పడియున్న దేది?యు
ర్వర సుఖదుఃఖపు స్వ్యతికరంబు ఘటిల్లు వివేకహీనతన్
బరమ మగున్ మహాపురుషభావ మనిర్వచనీయ మేదిమే
దురసుఖమున్ సుఖంబుగను దుఃఖము దుఃఖముగా గణింపదో.

కానీ వానియొద్దకే పోయెదను. (నడచి చూచి సశ్లాఘముగా)అహో
యిదిగో నామహాత్ముఁ డిక్కడనే యున్నాఁడు. సమీపించెదను
(అట్లుచేసి) ఓయిరాజా? సిద్ధిభాజనంబవు గమ్ము.

రాజు—మహావ్రతచారు లగునైష్ఠికులకు మీకు స్వాగతము.

కాపా—రాజా! మే మర్థుల మయి నీయొద్దకు వచ్చితిమి.

రాజు—(లజ్జపడుచున్నాఁడు)

కాపా—రాజా! నీవు బిడియపడకుము. మేము యోగచక్షులము
గదా! మాకు నీవృత్తాంత మంతయు గోచరించినది. ఇట్టియవస్థ
యం దున్నను మానమీహిత మొసంగుటయందు నీవు దరిద్రుఁ
డవు గావు.

తే. గీ. పరులయుపకారమునకు నెబంగి నయినఁ
గాకమానరు బుధులు నిక్కంబు చూడు
కుహూవునందనుజంద్రుండు బహుతరముగ
సంతసిలఁ జేయఁడే వనస్పతిచయంబు.

కావున సావధానుఁడ వయి యవధరింపుము.

రాజు—ఇదిగో నవహితుఁడ నయి యున్నాను.

కాపా—ఉ. వ్రాలుమహాత్మ్యముల్ గలుగువజ్రసాయనపాదలేపబే
తాళురు ధాతువాదమును దద్గుటి కాంచనదైత్యకామినీ
జాలవిధానముల్ గయివసంబులు నాకవి యంతరాయపుం
జేలములం దిరస్కృతిని జెందనిచందము మందలింపుమీ.

రాజా నీవు విఘ్నములు రాకుండా నాజ్ఞాపింప వలయు.

రాజు—అయ్యా ! సాధక ! యీశరీర మస్వాధీన మని యోగబలంబున నీ వెఱింగిన వాడఁవే గదా ! కాఁబట్టిస్వామ్యర్థావరోధంబుగాఁ బ్రయత్నించెదను.

కాపా—ఓరాజా ! యిందు స్వామ్యర్థవిరోధ మేమి యున్నది? భగవదాజ్ఞామాత్రముననే మాకు సమీహితంబుచేకూఱఁ గలదు. ఇదిగోఁజూడు మీదాపుననే సిద్ధరసంబు మహావిధాన మొకటి న్నది. తదర్థము మేము కృషిచేయువారము. నీవిక్కడనే యుండి విఘ్నప్రత్యూహ విషయంబున సావధానుండవు గమ్ము (నిష్క్రమించుచున్నాఁడు)

రాజు—(ధైర్యముతో నంతటఁ దిరిగి) విఘ్నములారా! తలఁగుఁడు తలఁగుఁడు. సర్వథా మీప్రసరణంబు ప్రతిహతంబు గావలయు (తెరలో) మహాప్రసాదము మహాప్రసాదము.

క. ఓరాజ ! నీకు విస్మృత
ద్వారంబులు శ్రేయములు, స్వయంవరలు మహో
దారలు విద్యలు, సిద్ధులు
స్వైరాగత లెవఁడు మీకుఁ ద్వచ్ఛాసనముౕ.

రాజు—ఏమినాయదృష్టము? నామాటకు విఘ్నంబు లనుమతించినవి నాకిది మహానందము.

(తరువాత విమానచారిణులు విద్యలు ప్రవేశించుచున్నారు)

విద్య—(శీఘ్రముగా సమీపించి) రాజా (హరిశ్చంద్ర) భాగ్యమున వర్ధిల్లుచున్నావు.

ఆ. వె. ఎందుకొఱకు నిన్ను ఋషివర్యుఁ డాగాధి
పట్టి బిట్టు గినిసి బాధపెట్టె

నట్టివిద్యలము త్వదాపదలకు మూల
ములము వచ్చినార మలఘు చరిత

రాజు—(చూచి యాశ్చర్యముతోఁ దనలో) ఓహో ! యేమీ ? యీపూజ్యరాండ్రావిద్యలా? త్రిలోకవిజయిను లగు విద్యలారా! మీకు నమస్కారము.

విద్య—రాజా ! మేము నీవారల మయినారము. మమ్ములనాజ్ఞాపింపుము.

రాజు—తల్లులారా? మీరు నన్ననుగ్రాహ్యునిఁగాఁ దలంచితిరేని మి మ్మొక్కఁడు వేఁడుకొనెదను. దయచేసి భగవానుని కాకోశికునకు మీరు వశపడుఁడు. దానంజేసి నే నహ్మాసీంద్రున కనపరాద్ధుండ నయ్యెదను.

విద్య—(విస్మయముతో నొండొరులను జూచుకొని) రాజా? నీయిష్టము (నిష్క్రమించుచున్నారు.)

(తరువాత బేతాళునిచే నిధానము మోపించుకొని కాపాలికుఁడు ప్రవేశించుచున్నాఁడు.)

కాపా—(త్వరితముగా సమీపించి) రాజా ! భాగ్యమున వర్ధిల్లుచున్నావు. ఇదిగో సంసిద్ధరసంబగునీమహానిధానమునీకు లభించుచున్నది. సర్వాశక్తిమంత మీరసేంద్రము నీవుపయోగింపుము

ఉ. ఓనరనాథ దీనియుపయోగముచేతన కాదె సిద్ధు లా
మానిత మైనస్వర్భువనమార్గము మృత్యువు గెల్చి, పొందినం
తానవనీనమంజరులఁ దద్దయు శోభిలు మేరుభూమిభృ
త్సానువులం జరింపుదురు సంతతసౌఖ్యరసావశాత్ములై,

రాజు—అయ్యా ! యిది దాసభావవిరుద్ధము. దీనివలన స్వామిద్రోహము సంఘటిల్లును గదా !

కాపా—(ఆశ్చర్యముతోఁదనలో)ఓహో! యెంతవింత! కానీ(ప్రయిశముగా) రాజా! అది యట్లయినచో నీవీమహానిధానమును గయికొని నిన్నును నీకళత్రంబును దాస్యంబువలనఁదొలఁగించుకొమ్ము

రాజు—అయ్యా! నాకది యెట్లు కాఁగలదు? దానభావ మధన మనికదా మనీషులు శాసించియున్నారు. స్వామ్యర్థమయినచో దీనిని నేను నిరాకరింపను. నీకోరిక నా కనుమతమే. కాఁబట్టి నీ విట నుంచిన యీమహానిధానమును స్వామ్యర్థము పరిగ్రహించుచున్నాను.

కాపా—(ఆశ్చర్యముతోఁ దనలో) ఓహో ధైర్యము! ఔరా! జ్ఞానము! ఏమీ యీ మహానుభావత్వము!

క. ప్రలయపవనంబు తాఁకునఁ
జలియించుఁ గులాచలములు సత్యంబుగ ని
శ్చలములు ధీరులమనములు
చలింప వవి యెంత లేసి శ్రమముల నైనన్,

కాఁబట్టి నాకెందు కీ యతినిర్బంధము? (ప్రకాశముగా భేతాళుని తో) భద్ర పోయి నీ వీభూపతి సమాహితము నాచరింపుము.

బేతా—(నమస్కరించి)చిత్తము సాధక!(నిష్క్రమించుచున్నాఁడు)

కాపా—(అంతటఁ జూచి) రాజా! విభావరి ప్రభాతప్రాయ మకానది. మే మిఁకఁ బోయివత్తుమా?

రాజు—అయ్యా! సాధక! దుస్సితకథలయందు మమ్ము స్మరియింపుఁడు.

కాపా—రాజా! నిన్ను దేవతులు స్మరింపఁగలరు. (నిష్క్రమించుచున్నాఁడు)

రాజు—(తూర్పు చూచి సప్రాసాదముగా) అహా!

తే. గీ. గాఢతిమిరంబు పంచబంగాళముగను
సంధ్య యరుణుండు నిజపురస్సరులు గాను
నఖిలభువనజాతానుగ్రహార్థ మిదిగోఁ
బయికి వచ్చుచు నున్నాఁడు భాస్కరుండు.

కాఁబట్టి నేనును బరమపవిత్ర యగుభాగీరథీతీరమునకుఁ బోయి స్వావ్యాదేశమున నుండెదను. (నిష్క్రమించుచున్నాఁడు)

—o—

శ్రీ పరమాత్మనే నమః

# హరిశ్చంద్ర నాటకము

## పంచమాంకము

(తరువాత వికృతమలినవేషుండయి రాజు ప్రవేశించుచున్నాఁడు)

రాజు—(విచారముతో నిట్టూర్పు పుచ్చి) అన్నా! యెంతకష్ట మెంతకష్టము!

ఉ. పంతము మానికిం గలిగె, బంధుసుహృత్తులఁ బాసితిన్, సుతుం
గాంతను విక్రయించితిని, గాటికిఁ గాపరి నైతి; నయ్యో! దు
ర్దాంతము లింత లాపదలు రా నతిమూఢకఠోరదుర్నయ
స్వాంతత నెంతదారుణము సల్పితినో తొలుమేన దైవమా!
హాహతవిధీ! నీవే బలవంతుఁడవు.

మ. నను నానమ్రశిరోధరుం దపసి కిన్కన్ రాజ్యలక్ష్మినియు
క్తునిఁ గావించి మిగిల్చె నేత్రయమయో దుఃఖప్రియాదుర్విధీ
కనలే కచ్చటఁ గూడ నీదుకపట క్రౌర్యంబులం జూపితే
తనయున్ నన్నును నాతిఁగోలుపడితిం ద్వద్దుర్విచేష్టంద్రుటిన్

చ. అనుదినముం గృశాంగి నిశలం దతిదీనత వెచ్చ నూర్చుచున్
దరకు లభించు నావలన దాస్యవిమోచన మంచు నాత్మలో
ననుకొని, పట్టి యుంచుఁదనప్రాణము నాదుపునస్సమాగమం
బున కయొ యిట్టికష్టదశఁ బొందినవానిఁగ నన్నెఱుంగమిన్

(నిట్టూర్పు పుచ్చి) హావత్స! రోహితాశ్వ!

ఉ. దాదులతోమ్ముపై యడుగు ధారుణి మోపి యెఱుంగవీవుతం
డ్రీ! దెస మాలి యాఁకటికి నేలను నేఁడెటు గూర్కు చుంటివో?
యాదల మానికంబు నటు లానతి భూపతులూనునిన్ను న
య్యో! దుడుకుఁదనంబున వటూత్కర మేపని కెందుఁబంచునో
(తడవుగ నిశ్వసించి సకరుణముగా)

చ. పడని మ్మాపద లొగ్గినాఁడఁ దల దాల్పక్; వానికిక్ స్వాగతం
బిడుమల్ మేళ్ళుఁగృతార్థసుస్థమతి కూహింపక్ సమానంబులే;
యొడిసెజ్జం బవళించు ప్రాయమున నయ్యో! క్రూరదైవాహిచేఁ
గొడుకా! దష్టుఁడవైతి వియ్యదిహృదిం గోయుక్ సదాఅంపమై
(సాశంకముగా) వత్సా! నీకుఁ బాపము శాంతించును గాక.
అమంగళము తొలంగును గాక.

"ఒడిసెజ్జం బవళించుప్రాయమున నయ్యో క్రూరదైవంబుచేఁ
గొడుకా దుర్దశఁ బొంది తియ్యదిహృదింగోయుక్ సదాఅంపమై"
(ఎడమకన్నును, గుడిభుజము నదరుట సూచించి సంతోషముతో)

క. అదరెడును వామలోచన
ముదరెడు దక్షిణభుజంబు నోహో వ్యసనా
భ్యుదయంబులు రెండును నా
కొదవం గల వనుచుఁ జాటుచున్నవి పోలెక్.

(ఆలోచించి) అయినను నా కింకను వ్యసనాభ్యుదయవిచారమెం
దుకు? దురాత్ముడు హరిశ్చంద్రహతకునిపని సర్వము సమాప్తం
బయినది గదా!

ఆ. వె. ఇంతకన్న నింక నెక్కుడౌ వ్యసనంబు
నభ్యుదయము నేది యగును నాకు

నకట పాతకునకు నభ్యుదయద్వార
మిప్పు డొకమరణ మే తలంప

(తెరచిమ్ముకొని చండాలుఁడు సత్వరముగాఁ బ్రవేశించి)

చండా—అరే! చిన్నికొడుకునకు—

రాజు—(సాశంకముగా) భద్రా! చిన్నకొడుకునకేమి?

చండా—ఓరీ! నేను జెప్పునది యిది. చిన్నకొడుకునకుఁ జేరువఁగూరుచుండి కొండొక యాఁడుది కడుపు దరిగోయ నెంతో జాలిగా నేడ్చుచున్నది. కావున నీవు వేవేగ నావంకకుఁబోయి దానిచేతఁ బీనుఁగుఁబాఁత బుచ్చుకోరా. నే నిదిగో సామియొద్దకుఁ బోయెదను. (నిష్క్రమించుచున్నాఁడు)

రాజు—(నడచుచున్నాఁడు)

(తెరలో) అయ్యో! కొడుకా! అయ్యో! నాకన్నతండ్రీ! ఎక్కడనున్నావు? పలుకవేమిరా బిడ్డా!

రాజు—(విని శోకముతో) కటకటా! యీ ప్రలాపమెంత దారుణముగానున్నది.

(తరువాత ముందుచెప్పినట్లు శోకమును నటించుచు శైబ్య ప్రవేశించుచున్నది.)

శైబ్య—అయ్యో కొడుకా! అయ్యో నాకన్నతండ్రి! ఎక్కడనున్నావు! పలుకవేమిరా బిడ్డా? (భ్రమానుపడుట నభినయించి యెట్టకేలకుఁ దెలివినొంది కన్నీళ్ళతో) హా పుత్ర! హా పుత్ర! యెక్కడనున్నావు? మాటు వలుకు తండ్రీ! అయ్యో యిది యేమిరాబిడ్డా! మీ తండ్రిగారు విడిచిపెట్టినట్టే యదృష్టహీనురాలిని నన్నిప్పుడు నీవును విడిచిపెట్టితివి. ఇది యుక్తమగునా యన్నా (మూర్ఛిల్లుచున్నది.)

రాజు—(విని చూచిదుఃఖముతో) పాపమీదీనురాలిని భర్తకూడఁబరిత్యజించినాఁడా? ఛీ ఈ పాపష్టి దైవమునకు సర్వథా సర్వత్ర నిష్కరుణతయే గదా

శైబ్య—(తొందరతో లేచి) అయ్యో! యేమిజరిగినది? కొడుకెక్కడకుఁ బోయెనో గదా! (చూచి కౌఁగిలించుకొని)కొడుకా! నాతోమాటలాడవేమి? నాయనా! యొక్కర్తను భయపడుదును గదా! ఈ భీషణమైన మహాశ్మశానమును గన్నువిచ్చి చూడవేమిరా? (ఉన్మాదముతో) బిడ్డా! యేమనుచున్నావు? ఉపాధ్యాయులయానతిని గానకుఁబోయి పూవులు గోయు చుండఁగా ప్రమానితొఱ్ఱలో నుండి నల్లత్రాఁచు బుస్సుమని లేచి కాటు వైచిన దనుచున్నావా? అయ్యోతండ్రీ! యేదే దోయి నల్లత్రాఁచు? అది నన్నెందుకుఁ గఱవదురా కొడుకా? (అంతటాఁజూచి) ఇది యెల్లను గల్లకల్ల. ఇక్కడ నల్లత్రాఁ చెక్కడ? (కూర్చుండి సకరుణముగా) హా కుమార! కుమార! లేరా ఒజ్జలకొఱకు నీవు దెచ్చిన యచ్ఛిద్రమైన యీ మారేడుఁబత్తిరిని నూవుఁజేనిలో మొలచిన యీదర్భాంకురములను జెచ్చేరనాయన కిచ్చిరారా. హోమవేళ యాయన కతిక్రమించునని నీవిప్పుడు దెలిసికొనలేవురా.బిడ్డా? అయ్యయ్యో! నీతోవచ్చిన బ్రహ్మచారులందఱు నింతకు నిల్లు సేరుదురు గదా! లేలెమ్ము (లేవఁ దీయఁ బోవుచు సావేగముగా) ఏమిది? నాయనా! నిర్భాగ్యురాలిని నన్ను నిజముగానే విడిచిపెట్టితివా? దూరమైతివిరా తండ్రీ? అయ్యో చచ్చితినిరా బిడ్డా! (మూర్ఛిల్లుచున్నది.)

రాజు—(దుఃఖముతో) ఆహాహా! కరుణాగంధశూన్యున కా కటికి దైవమునకైన నీయార్తాలాపములు ద్రుశ్శ్రవంబులుగదా!

శైబ్య—హా! నాథ! సర్వథా నిష్కృప! అస్వస్థచిత్తుఁడవయి నీవిప్పు డెచ్చట నున్నావు? నీయుత్సంగమునఁ జెంగలించు ననుం

గునిసుంగున కిప్పు డెంతటియవస్థాంతరము సంప్రాప్తమయినదొ కనుంగొనుము. ఆర్యపుత్ర! యేమఱక బిడ్డను గాపాడుమని నా కాజ్ఞాపించితివి. పాపశీలను నేనాలాగునఁ గావింప నయితిని.

రాజు—(నవిశేషకరుణంబుగా) అహా! యీపరిదేవనము లాయముల ను గోయుచున్నవే.

శైబ్య—(మృతుని ప్రత్యంగము దడవిచూచి) హాయన్నా! క్రొన్నె ల చెన్నున వన్నెమీఱు నిది నీనెన్నుదురు గదా! పుత్రకా యొత్తయినతెప్ప వెంద్రుకల నొప్పి పర్యంతపాటలంబు లయి సుస్నిగ్ధధవళంబు లగునివి నీకన్నులుగదా! కొడుకా! సుఘటి తాస్థిబంధకఠినవిస్తీర్ణమిది నీహృదయఫలకముగదా! తండ్రీ! సంహననుహననుండవు, నీయాకృతి యాకృతాంతహతకున కేమి యపలక్షణము దోఁపించిన దోయి సత్యసంధున కార్యపుత్రునకు మందభాగిని నగునాచరితముల దాలగునఁ బ్రమాదము గలిగినది. సర్వథా ధర్మమకారణము; లక్షణమప్రమాణము; విజ్ఞానవేదు లలీకవాదులు; అయ్యయో! సాముద్రికవిచక్షణులెంద తెంద ఱో వీని యవయవ లక్షణములయందు విశ్వాసము గలవారయి యితఁడు దీర్ఘాయుష్మంతుండు వంశోద్ధారకుండు, సార్వభౌముం డు గాఁగలఁడని పలుమాఱు ప్రశంసించిరి.ఆప్రశంసములన్నియు మందభాగ్యురాల నయిన నా కర్మమున నసత్యములే యయిపో యినవి.

రాజు—(సాశంకముగా) అయ్యో! యేమీ! యిదియంతయు నాకే తగిలివచ్చుచున్నది (నిపుణముగాఁ జూచి కన్నీళ్ళతో) ! హా యే మిది ?

మ. గొడుగుంబోలుశిరంబు, పెద్దనుదు, రక్షుల్ దీర్ఘముల్ చిన్నితే
యడుగుల్ చక్రసులక్షితంబులు, భుజాలాజానులంబుల్ స్ఫార

జడజంబుల్ కరముల్ గవుఁగ్గృశము, పక్షంబాయతం, బన్ను వా
గడు పీపాపఁను చక్రవర్తి పదయుక్త క్షత్రియాంకూరమే.
(జ్ఞప్తి వచ్చి దుఃఖముతో) అయ్యో! నిజముగా మా రోహితా
శ్వున కిదే యీాడు. అందుచేత నాహృదయమున కనుమానము
కలుగుచున్నది. కానీ వత్స కమంగళము దొలంగుఁ గాక.

శైబ్య—హా! భగవానుడా! కౌశిక! యిప్పుడుగదా నీవు కృతా
ర్థుఁడ వయితివి!

రాజు—(సావేగముగా) హా! యేమిది! భగవానునిఁ గౌశికుని నిం
దించుచున్నది; ఎందుఁగాని యించుకయు భేదమన్నది కానరాదు
ఈమె పరదార యెట్లులగును. నిజముగా నీతపస్విని శైబ్యయే.
(తడవుగఁ దేఱిచూచి సకరుణముగా) ఇంకను సందేహమెందుకు?

మ. మృదువీణాస్వనమెల్లు రాల్పడే నదేయేడ్వఁగ్ మహార్తధ్వనిఁగ్
జెద రెందుమ్మోదకప్పుబెన్నఱినెఱుల్; చిక్కాఁగ్ సమస్తాంగముల్
మదికిం బోలుపరాక; నెమ్మొయిజిగిఁగ్ మాలిన్యముంబొందిప్రాఁ
తది యాచిత్తరురూపుచందమున వేద్యం బయ్యెడుఁగ్ లేఖలఁగ్

హా! వత్స! రోహితాశ్వ! యెక్కడనున్నావు? పలుక వేమిరా
తండ్రి! (మూర్ఛిల్లి మరల దెలిసి రోహితాశ్వునిఁ జూచి)

తే. గీ. ప్రథితమంగళగుగ్గులురచిత మైన
సన్నచిన్నారికూళ టిజడలు ప్రేల
మధుపలంఘితముగ్ధ తామరసశోభ
నెసఁగునీమొగ మిపు డొప్ప దేర తండ్రి.

హా వత్స! హా రోహితాశ్వ! హా తపనకులబాలప్రవాల! హా హ
రిశ్చంద్రహృదయానందన! హా కుపితకౌశికదక్షిణానృణ్యప్రదా
నపణ్య!

చ. అనిమిషు లొందఁ దృప్తివివి ధాధ్వరముల్ సవరింప లేదు యా
చనకుల కీప్సితార్థము లొసంగను లేదు; దిగంతమం దనం
బును నెలకొల్ప లేదు; సుఖముం గనలేదు కులార్హ మూహరం
బునవటబీజపున్మొలక వోలె వృథాపొలియివోతే సుతా.

మఱియు నోరిచిన్నియన్న !

చ. శిర మభిషేకతోయమునఁ జేతులు దానమునన్, బదద్వయం
బరినృపమౌళిపాతమున నందఁగ లేదు పవిత్రతన్; మనో
హరభుజముల్ ధనర్గుణకిణాంకములం ధరియింపలేదు; నీ
పుర కుదయించి రూపఱి తయో! ప్రతిపచ్ఛశిలీలఁ బుత్రికా.

(ఆలోచించి) నే నింక ని క్లెందు కుండవలెను? ఈ యేడ్చుచున్న దేవియొద్దకుఁ బోయి నన్నెఱింగించుకొనియెదను. కాదిది యయుక్తము. ఈ వఱకే పుత్రశోకమున మల మల మఱుఁగుచున్న యీదీనురాలికి స్వదశావిపర్యయంబున మఱింతయాతన గలిగింప నేటికి? (తన్నుఁ జూచుకొని) ఓరిదురాత్మా! హరిశ్చంద్ర హతక! నీ వింకను జావవేమిరా? ఇంతకన్నను నీవేమి చూచెదవు? (మూర్ఛిల్లి మెల్లగాఁ గన్నులు విచ్చి దురాత్మా హరిశ్చంద్రహతక యిట్టిదురవస్థయందును నీపాడుప్రాణములను విడిచిపెట్టఁ జాలకున్నావు. ఆత్మహత్యఁ గావించుకొనువాని లోకమునకు నిన్నుఁ దప్పించుకొనఁ జూచుచున్నావా యేమి? ఛీ! మూర్ఖ:—

తే. గీ. దారుణాంధతమిస్రాఖ్యనారకమున
నిప్పుడే పోయి మునుఁగు టొకింత మేలు
పుత్రముఖచంద్రరాహిత్యమునను జిమ్మ
చీఁకటులు గ్రమ్ము దెసల వీక్షింప కుండ.

ఉ. ఇంతయు నంత యంచు మితి యెక్కడఁ బుత్రవియోగత దు
ర్దాంతదురంతవేదనకుఁ? దాదృశయాతన లేదు లేద యం
ధంతమమందు రౌరవము నం గ్రకచోత్కటభైరవాసిప
త్రాంతరమందు శాల్మలిని నక్కట హేయపుఁబూయపిచికన్.

ఇంక నాలస్య మెందుకు? పుత్రశోకానలదహ్యమానుండ నగు నేను భాగీరథీతీరంబునకుఁ బోయి యీ శరీరమును బరిత్యజించెదను.

(మెల్లగా నడిచి, తలంచుకొని సంభ్రమముతో) అయ్యయ్యో! నేను బరాధీనుఁడ నన్నమాట బొత్తిగ మఱచి పోయితినే. (విచారించి దుఃఖముతో) అన్నన్నా యెంతకష్ట మెంతకష్టము!

క. మృతివలనను గాంతురు ని
ర్వృతి నతిశయముగ స్వతంత్రవృత్తులు ధన్యుల్
క్షితిలోన నాత్మవిక్రయ
లతిపాపులు పాయఁజాల రకటా యసువుల్.

(దుఃఖించుచు) అయ్యో! మందభాగ్యుఁడను నే నాకోరికకును దూరమయి పోయితిని.

తే. గీ. దారుణం బైన యీదుఃఖభారమునకుఁ
దగినయౌషధ మున్నది ధైర్య మొకటి
యేలి నాతనియానతి యింత మీఱఁ
గలుగునారక మప్రతీకార మరయ.

కావున దుస్సహదుఃఖానలదందహ్యమానుండ నగునన్ను వివేకజలంబులం జల్లార్చుకొని ప్రభుశాసనముననే యుండెదను.

శా. నాదిభ్రాంతిని వ్యక్త మౌ నధమ నవ్యక్తంబ యాదిం దుదిన్;
బ్రాదుర్భూతము పంచధా జగము; తత్పంచత్వ మబ్రం బొకో;
యాదోరాశితరంగభంగవలనవ్యాపార మౌ సంసృతిన్
భేదం బేమి వియోగయోగములకున్; ఖేదంబు మోహోత్థమే.

శైబ్య—(తెలివ వచ్చి) అయ్యో యీవల్ల కాటిప్రాణము నన్నింకను విడిచి పెట్టి పోవకున్నది. ఇందుకు నే నేమి చేయుదును. (కన్నీరు దుడుచుకొని) కానీ ఈశ్మశానవృక్షమున నురిపోసికొనియీ పాడుజీవము పోఁగొట్టుకొనియెదను. (ఉరిపోసికొనుచున్నది.)

రాజు—(చూచి తొట్రుపాటుతో) అయ్యయ్యో! యిప్పుడు మఱి యొకజీవితవ్యసనఫలము సంప్రాప్త మగుచున్నది. మందభాగ్యుఁడను నే నిందు కేమి చేయుదును?

(ఆలోచించి) కానీ ఈలాగునఁ జేసెదను. (మఱియొకచోటికిఁ బోయి "మృతివలనను గాంతురు నిర్వృతి" యను నీ పూర్వో క్తపద్యము చదువుచున్నాఁడు.)

చ. కనఁ బరలోకభూములు స్వకర్మవిభేదవిపాకవిభ్రమం
బునను విరూఢమార్గములు వో మ్మనుచుం బరలోకతత్త్వవి
జ్జనములు మాయ నుజ్జనము సల్పి హసింతురు నెమ్మనంమనం
దనిశ మపార మై యవశాత్ములయేతదసార సంసృతిన్.

శైబ్య—అవురవురా! యెంతప్రమాద మెంతప్రమాదము! మరణ మహోత్సవవ్యాసక్తహృదయ నయి పరాధీనజీవితురాల నగు నేను దాసత్వము విస్మరించితిని. నేను బదరి యట్లే చేసి యుంటి నేని జన్మాంతరమున నయిన నీదాసభావము నన్నువిడువకుండును గదా! అయ్యో! యప్రతీకారదారుణం బగునీదశావిపర్యయం బుననేనీ నెందాఁక నలమరుదానను? కానీ కాలోచితము నాచ రించి దాసత్వసముచితం బగు శుశ్రూషచేత బ్రాహ్మణోత్తము నారాధించుచు నదృష్టహీనురాలను నే నీమనుష్యలోకమునఁ గ్రమ్మఱ జన్మింప కుండ వ్రతోపవాసనియమంబుల నీదేహంబు శోషిల్లం జేసికొనియెదను. (పొద పేర్చుచున్నది)

రాజు—(చూచి దుఃఖముతో) అయ్యో! యీయామె కాలోచితకర్మ మున కప్పుడే యారంభించినది. (తనలో) దేవీ! బాగుబాగు; నీ విట్టియవస్థయం దయిన నాభిజాత్యము నతిక్రమింప కున్న దానవు. ఇంక నే నీమెను సమీపించి ప్రభుశాసనము నెఱవేర్చె దను. (సమీపించి విచారముతో) దేవీ! [ఆర్ధోక్తిని నోరుమూసి కొని] ఓ మహాభాగురాల!

క. సడయక నాయాదేశం
బిడకయు మృతకంబలంబు నెవ్వరు గానీ

నడపంగ రాదు మననపుఁ

గడఁ గావింపంగ వలయుకర్జము లెవి యుర్

క్కాఁబట్టి మృతకంబలము నీయవలయును. [కన్నీళ్ళుడంచుకొని చేయి సాఁచుచున్నాఁడు]

శైబ్య—[భయము నటించుచు] భద్రముఖ! దూరముగా నుండుము నేను నీకిచ్చెదను.

రాజు—[లజ్జించుచు] ఉన్నాఁడను.

శైబ్య—[రోహితాశ్వునిశరీరముమీఁదనుండి బట్టతీసి యిచ్చుచు హస్తమునుజూచి విస్మయముతోఁ దనలో] ఏమిది! చక్రవర్తి లక్షణలక్షితం బయ్యు నీచెయ్యి యిటువంటివ్యాపారమునం దుప యుక్తమైనది! [సమీపించి మెల్లగా నెల్లయవయవములుచూచి యానవాలు పట్టి] ఏమిది! అయ్యో! ఆర్యపుత్రులా? [తత్తఱపాటుతో] హా! యార్యపుత్ర! రక్షింపు రక్షింపు [పాదముల మీఁదఁ బడుచున్నది]

రాజు—[తొలఁగి] దేవి! చండాలదాస్యదూషితుండ నయిననన్నంటఁ దగదు. ఊఱడిల్లు మూఱడిల్లుము,

శైబ్య—[ఊఱడిల్లి] అయ్యయ్యో! యిది యేమి?

రాజు—దేవీ! యిది పూర్వజన్మకర్మములపంట.నీవిందుకు విలపింప కుము. మృతకంబలమును దెమ్ము.

శైబ్య—[దుఃఖముతో నిచ్చుచున్నది] ఆకాశమునుండి పుష్పవర్షము కురియుచున్నది.

ఇద్దఱు—[వింతతోఁ జూచుచున్నారు]

[తెరలో] క. ఔరా దానము, శీలం

బౌరా, ధీరత్వ మౌర, యౌరా సత్యం

బౌరా యోరుపుఁ జ్ఞానం
బౌరాహరిశ్చంద్రభూపహార్యశ్చునసుక్.

శైశ్య—[విని సశ్లాఘముగా] ఆహాహా! యెవరోగాని యార్యపుత్రుని గుణశ్లాఘవలన నాహృదయము నూఱడించుచున్నారు. అయిన నీగుణశ్లాఘమున కేమిగాని యార్యపుత్రునంతటివాని కీదృశావస్థ తటస్థించుట చూడ సర్వథా ధర్మమకారణము సత్యమరణ్యారోదనము, విజ్ఞాన మంధకారనర్తనము

[ధర్ముఁడు ప్రవేశించుచున్నాఁడు]

ధర్మ—హా! పతివ్రతామణి! హా! మహారాజహరిశ్చంద్ర నే నకారణుఁడ నెట్లులగుదును? చూడుము.

చ. తమతమసత్యవాక్యముల దానములన్ మఱి యార్జితంపుఁగ
ర్మములను లాఁతిభూపతులమండలి కెయ్యవి దుర్లభంబు ల
వ్విమలతరాత్మదర్శనపవిత్రము లై తగు శాశ్వతంపులో
కములను నేను నీకు నొసఁగం జనుదెంచినవాఁడ నియ్యెడన్

కావున నీవింక విచారింపకుము, వత్స! రోహితాశ్వ! యూఱడిల్లు మూఱడిల్లుము.

రాజు—[చూచి సంతోషముతో] ఏమీ భగవానుఁడు ధర్ముఁడా? మహాత్మా! యభివాదనము చేయుచున్నాను.

శైబ్య—స్వామీ! ప్రణమిల్లుచున్నాను.

రోహి—మెల్లమెల్లగాఁ గన్నులు దెఱచుచున్నాఁడు]

ధర్మ—రోహితాశ్వ!

క. పితృధర్మ పాలితుండ వ
యితి వీవు కుమార; మరల నేతెంచును నీ
గత మైనయట్టిప్రాణము
క్షితిప్రజలను నేలుకొనుదు చిర మూఱడుమా.

రోహి—ఓహో! మాయమ్మ వచ్చినది. అమ్మా! నిన్నిచ్చటి కెవరు తీసుకొనివచ్చినారు?

శైబ్య—ఎవరున్నారు నాయనా? నాకర్మమే నన్నిక్కడకుఁ దెచ్చినది.

ధర్మ—వత్స! రోహితాశ్వ! యిదిగో బ్రహ్మలోకాతిథి మీతండ్రి నీయెదుట నున్నాఁడు.

రోహి—ఓహో! నాయనగారా? రక్షింపుఁడు రక్షింపుఁడు. తండ్రి మీఁద వ్రాలు చున్నాఁడు.

రాజు—పుత్రికా! చండాలసేవదూషితుని నన్ను నీవు దాఁకఁగూడదు.

ధర్మ—రాజా! నీ వింక నీదీనాలాపమును జాలింప వచ్చును. ఏమనఁగా—

శా. నీయిల్లాలిని గొన్న బ్రాహ్మణుఁడు పత్నీసంయుతుం డెవ్వఁడో
హేయాకారముతోడ నిన్ను గొనినాఁడీమాలవాఁ డెవ్వఁడో
న్యాయం బొప్పఁగ నెందుఁజేయుదువొ రాజ్యంబెల్లగుహ్యాంబుభూ
పాయాధార్థ్యమెఱుఁగనీ కిపుడు దివ్యలోక మే నిచ్చెదన్.

ఎవఁడురా పరిచారకుఁ డక్కడ?

పురుషుఁడు—(ప్రవేశించి) స్వామీ! యాజ్ఞాపింపుము.

ధర్మ—ఓరీ! విమానమును దీసికొని రమ్ము.

పురు—చిత్తము స్వామీ (అట్లు చేయుచున్నాఁడు)

ధర్మ—మహారాజా! నీ విమాన మధిరోహించి దివ్య నేత్రమున సర్వము నెట్లున్నదో విలోకింపుము.

రాజు—చిత్తము మహానుభావ! (దివ్యవిమాన మారోహించిధ్యానము నటించి) ఓహోహో! విద్యలు దన్నుఁ బొందిన వన్నసంతోషముచేత భగవానుఁడు కౌశికుఁడు మారాజ్యమును విడిచి మంత్రుల కప్పగించినవాఁడు.

ధర్మ—మహారాజా! భవదీయమగుసత్యవాక్యమును బరీక్షింపవేఁడి

యాతపోధనుఁడట్లుచేసినాఁడుగానియాయనకు నీరాజ్యమెందుకు?
నీవు సంభ్రమింపక యింకను దేటగా సర్వము నాలోకింపుము.

రాజా—(వెండియు ధ్యానము నటించియానందముతో) దేవీ! నీవేం తయదృష్టవంతురాలవు.

ఉ. బానిసగా నినుం గొనినపాఱుఁడ పారక్య పానిధానుఁడీ
శానుఁడు సుమ్ము; బ్రాహ్మణియు సర్వజగజ్జనయిత్రి యద్రిజా
మానిని; నన్నుఁగొన్నతఁడు మాలఁడు గాఁడనఘుండు ధర్ముఁడో
చాన!యథార్థ మిట్లగుట శల్యమువాసెను నేఁడు నాహృదిన్.

ధర్మ—అట్లయిన నిప్పుడు రాజా! కుమారుని రోహితాశ్వునిఁబృథివీ రాజ్యమున కభిషేకింపుము.

రాజు—చిత్తము మహాభాగా.

ధర్మ—సింహాసనము సింహాసనము; ఆతపత్ర మాతపత్రము; చామరము చామరము; జలకుంభము జలకుంభము.

పురు—మ. ఇదె భాస్వన్న వరత్న సంస్థగిత మా
హేమోచ్చ సింహాసనం
బిదిగో శారదచంద్ర మండలనిభం
బిద్ధాతపత్రంబు; కా
మదివెల్లిన్నగు హైమదండరుచిరం
బుల్ చామరా లివ్వె; కాం
డధిరాట్సప్తక సంభృతాంబు పరిపూ
ర్ణస్వర్ణకుంభం బిదే.

ధర్మ—(పైకిఁజూచి) ఓహో! యెంతయదృష్టము! ఈ రోహితాశ్వకుమారుని యభిషేకమహోత్సవమును దేవత లభినందించుచున్నారు.

ఉ. వీరెనదుల్ ధరించిరి పవిత్రపయః పరిపూర్ణ కుంభముల్;
భూరిసు పర్వదుందుభులు మ్రోగు నివేదివి యందు ముక్తమం
దారసువృష్టులౌ చిదిగో నర్తనముంబొనరింతు రచ్చరల్;
చేరి యిదే నృపాలుని భజింత్రు నిజాళముల్ దిగీశ్వరుఁడు

కరణీయ మాచరితం బయ్యెఁ గావున నీ విఁక బ్రహ్మలోకమునకుఁ బ్రయాణము గమ్ము.

రాజు—భగవానుఁడా !

శా. నందష్టోష్మత ఘోరతర్జనల విశ్వామిత్రుఁడుగ్రుఁడు రాఁ
గం, దేవా ప్రజలం ద్యజించి యెట కేగం జూతు కొంపోమ్ము మ
మ్మం దోనంచు సబాష్ప నముఖులై మున్నన్నావారి మో
నం దిగ్గ న్విడి కాంతు నె ట్లొకడఁ ద్వత్స దిష్టలోకంబులన్.

ధర్మ—రాజా ! స్వకర్మవైచిత్ర్యంబునం జేసి యుచ్చావచస్వభావులగు ప్రజలకా, యింత లేసి భాగధేయంబులు ?

రాజు—మహాత్మా! విను నానిశ్చయము.

క. తిరుగుదు నయ్యేలోకము
లతనిమునం బైన వార లందఱతోనే
దొరకుత నాదగు పున్నెపు
నెరసున సే వారలకును నీచూపుగతుల్

ధర్మ—(విస్మయముతోఁ దనలో) అహో! యీరాజర్షి చరిత్రము లోకోత్తరము !(ప్రకాశముగా) రాజా! యేతత్పుణ్యదానసంభావితం బగు నపరపుణ్య సంభారంబు చేత నీకును నీప్రజలకుంగూడ శాశ్వతలోకంబులు సంపాదించుకొన్నాఁడవు. నీకింకనుగావలసిన దేమి యున్నదో దానిని బ్రసాదించెద నడుగుము.

రాజు—భగవానుఁడా! యింతకన్నను నాకుఁ గావలసిన దొకటి యుండునా ? చూడు—

చ. పొనఁగుటఁ జేసి విద్యలు తపోనిధి నాపయి వీఁడె గోప మీ
నిసుఁగును బ్రాణముల్ వడసి నేలకు నయ్యెను జక్రవర్తి; నా
కొనఁగితి నీదుదర్శనము; నొందఁగఁ గల్గెను బ్రహ్మలోకమున్,
గొనరఁగ నింతకన్న నొకకోరిక నా కెదలోన నుండునే.

అయిన నిట్లగుఁగాక.

మత్తకోకిల. పైఁడిపచ్చలతోడ నిచ్చలపారసౌఖ్యబుధాళితో
ధారుణీసతి, గెల్పుతో వసుధాస్థలీపతి గ్రాలుతన్;
సారవేత్తలనుగ్రహించుతనత్కవుల్ నిజకావ్యసం
భారమందునుబాడుకొల్పి నభవ్యపుంగుణలేశమున్

ధర్మ—తథాస్తు

రాజు—మ. ఎవఁ డీనాటక మాడ నానతిడె మే నెంతే గగుర్పానహ
ర్షవశుండై ఘనవస్త్రహేమమణిభూషారాసులిచ్చెన్ దినం
బవనీశుండలకార్తికేయుప్రథ క్షీరాంభోధితీరంబునన్
గవిపేరగ్రసరంబుగా జగములోనం గ్రుమ్మరుంగాపుతన్.

ధర్మ—తథాస్తు. (అందఱు నిష్క్రమించుచున్నారు.)

ఇది శ్రీపరమేశ్వరవరప్రసాదలబ్ధ సరసకవితాధురంధర వడ్డాది
సాధువంశక్షీరనీరాకర రాకాసుధాకర రాచ్చనామాత్య
పౌత్ర హారితసగోత్ర పవిత్రగుణకదంబలక్ష్మాం
బాగర్భశుక్తిముక్తాఫల సూరపరాజప్ర
ధానతనూభవ విబుధవిధేయ
సుబ్బరాయనామధేయాం
ధ్రీకృతంబగు చండకౌశిక
(హరిశ్చంద్ర)
నాటకమునందు
సర్వంబును
పంచమాంకము.
సంపూర్ణము

